శ్రీ ర స్తు.

# శ్రీ కాశీమాహాత్మ్యము

## వ చ న కా వ్య ము

కా శీ ని వా సి

శ్రీ రాచకొండ అన్నయ్యశాస్త్రిగారిచే

వి ర చి త ము.











చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్సు వారిచే

ప్ర క టి త ము.

1933

# భూమిక



శ్లో. గృహమేధ్యత్ర విశ్వేశో భవానీ తత్కుటుంబినీ,
సర్వేభ్యః కాశిసంస్థేభ్యో మోక్షభిక్షాం ప్రయచ్ఛతి.
శాన్తికన్థాలసత్కంఠో మనఃస్థాలీమిలత్కరః,
త్రిపురారిపురద్వారి కదా స్యాం మోక్షభిక్షుకః.

ఈయసారసంసారమున మానవులకు సాధనచతుష్టయ
మవశ్యకర్తవ్యము. అందు, ధీవరులు సహితము త్రివర్గసిద్ధి
కొఱకు పాటుపడుచు, కాలప్రభావమున మోక్షప్రాప్తి కను
వగు కర్మాచరణమువలనను యోగావలంబనమువలనను జ్ఞాన
మలవరచుకొనుట సుకరమైనను గమనింపని కతమున నసం
భవమయి యొప్పుచున్నయది. అందువలననే యుగాంతర
ములనుండియు, పరమకారుణికదయాస్వరూపుండగు భగ
వంతుఁడు శ్రీవిశ్వేశ్వరుఁడు తన రాజధాని యగు కాశికా
పురంబున శరీరత్యాగ మొనరించు ప్రాణికోటికి, తారకోప
దేశ మొసంగి బ్రహ్మజ్ఞాన మలవరచి పరమపదప్రాప్తి కర్హత
నొసంగుచుండె నను సంగతి శ్రుతిస్మృతిపురాణేతిహాసముల
యందు విశేషముగ వర్ణితమయి రాజిలుచుండెను. అందు
స్కందపురాణచతుర్థభాగ మగు కాశీఖండము కేవల మీ
విషయమునే ధ్రువపరచుచున్న దను విషయము సుప్ర
సిద్ధము. అంతియ కాక పలుపురాణములలో కాశీక్షేత్ర
మాహాత్మ్యమును అందలి శరీరత్యాగము మోక్షదాయక

మనియును సుస్పష్టముగ వివరింపఁబడియున్నది. అది కారణముననే రాజాధిరాజులు మొదలు భిక్షులవఱకును, పండిత ధురంధరులు మొదలుకొని పరమమూర్ఖులవఱకును కాశీవాస మవశ్యకర్తవ్యమనియు,పరమధర్మమనియుఁ దలంచుచున్నారు. చిత్తస్థిరతయు, భూతదయాపరతంత్రతయు, స్వధర్మాసక్తియు, భగవధ్యానానురక్తియు, పరమానందస్వరూపాభిలాషయు, కాశియందు దలపడునట్టుల వాస్తవముగ నితరత్ర యలవడుట బహుదుర్ఘటము. చిరకాలము కాకపోయినను స్వల్పకాలమయినను యెంతదూరమున నివసించుచున్నను కాశీవాసమభిలషింపని హిందువు లేఁడని చెప్పవచ్చును. దాననే, వ్యాసభగవానుఁడు మత్స్యపురాణమున,

**శ్లో. దేవో దేవీ నదీ గంగా మిష్ట మన్నం శుభాగతిః,**
**వారాణస్యాం విశాలాక్షి వాసః కస్య న రోచతే.**

యని యథార్థముగ చెప్పియున్నాఁడు.

కాశియందు విశేష మెద్దియు లేనియెడ, దూరదేశీయులు సయితమరుదెంచి, విధ్యుక్తముగ, భక్తియుక్తముగ యాత్రాదికములు నెరవేర్చుకొని దానివైభవమును దిలకించి యగ్గించుటెట్లు?

కాశియందలి మృతి పరమసౌభాగ్యప్రద మని తలంచి, యభిలషించు మనుజులు లెక్కకు మిక్కిలిగ యుండిన కతమున కాఁబోలు, త్రికాలవేది యగుకృష్ణద్వైపాయనమహర్షి కాశీఖండమున

**శ్లో. మరణం మంగళం యత్ర విభూతి ర్యత్ర భూషణం,**
**కౌపీనం వసనం యత్ర కాశీ కేనోపమీయతే.**

యనియు,

శ్లో. విద్యానాం సదనం కాశీ కాశీ లక్ష్మ్యాః పరాలయః,
ముక్తిక్షేత్ర మిదం కాశీ కాశీ సర్వా త్రయీమయీ.

యనియు పొందుపరచెను.

ఏది యెట్లున్నను, నేటికాలమున సయితము, కాశి యందు మరణమాత్రాభిలాషులై వేనవేలు స్త్రీపురుషులు నివసించియున్నారు. అందువలన త్రిలోకవిఖ్యాత మయి, క్షేత్ర సంతతులలో నుత్తమోత్తమ మయి, పరమపదదాయక మయి, త్రయీమయాత్మక మయి యొప్పు నీయవిముక్తక్షేత్రమాహాత్మ్యమును కొద్దిగొప్ప తెలిసికొనుట విహితకృత్యము. వ్యాస విరచితము లగు సమస్తగ్రంథములలో కాశీమాహాత్మ్యబోధకము లగు గాథలు చేర్పఁబడియున్నవి. అవి యన్నియు సంగ్రహించి యొకచో చేర్చిన, కాశీఖండమున కతిరిక్త మగు ననుట నిస్సంశయము. కాశీఖండమును సాంతముగఁ దిలకించి యందలి తత్త్వమును గ్రహియించుటకు పలువురు గ్రంథ బాహుళ్యమని వెనుదీయుచుండ, నిక నీగ్రంథమును జూచువార లెవరు? అయినను, భగవద్భక్తిపరాయణులు ఏతత్పుర మాహాత్మ్యామృతమును గ్రోల ననురక్తు లుందు రను గట్టి నమ్మకమున, పద్మపురాణాంతర్గత మగుకాశీమాహాత్మ్యమును ప్రధానముగఁ జేసి, సమయానుగుణముగ, కాశీఖండ, కాశీ రహస్య, మత్స్యపురాణాంతర్గతము లగు పెక్కు విషయములను జేర్చి యీచిన్ని పుస్తకమును, "చంద్రునకు నూలి పోగు" అను తెలుఁగున నాంధ్రవాఙ్మయమునకు కానుక

నొసంగితిని. కాశీపురాభిమానులు తద్భక్తిపరతంత్రులు దీనిని సాదరభావమున దిలకింతు రని నాయాశయము.

ఇందు లేఖక ప్రమాదజనితదోషంబులను దొలఁగించు ప్రయాసమునకు సహించిన సద్గురువరులును, నాంధ్ర బ్రహ్మాండ పురాణ, ఆంధ్ర రామాయణ, హాలాస్యమాహాత్మ్యాది పలు గ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ బాలసరస్వతి జనమంచి శేషాద్రి శర్మ గారికి నాకృతజ్ఞతాపూర్వకవందనశతపరంపర లొసంగు చుంటిని.

149, హనుమాన్ ఘాటు,
బెనారస్ సిటి.

ఇట్లు, సజ్జనవిధేయుండు,
రాచకొండ అన్నయ్యశాస్త్రి.

# విషయసూచిక.

## ప్రథమాధ్యాయము.


| విషయము. | | పుట. |
|---|---|---|
| బ్రహ్మవిష్ణువులకలహము | ... | 4 |
| విశ్వేశ్వరలింగప్రాదుర్భావము | ... | 5 |
| విశ్వేశ్వరలింగమహిమ | ... | 6 |
| భూరిద్యుమ్నమహారాజుకథ | ... | 8 |
| కృశునికథ | ... | 15 |


## ద్వితీయాధ్యాయము.


| | | |
|---|---|---|
| కాశీక్షేత్రప్రభావము | ... | 19 |
| వసిష్ఠవామదేవసంవాదము | ... | 23 |
| క్రమేలకచరితము | ... | 34 |


## తృతీయాధ్యాయము.


| | | |
|---|---|---|
| సుపర్వునికథ | ... | 39 |
| శ్వేతకికథ | ... | 46 |
| యాజ్ఞవల్క్యజనకసంవాదము | ... | 49 |
| జ్ఞానవాపివృత్తాంతము | ... | 51 |
| మణికర్ణికామాహాత్మ్యము | ... | 58 |


## చతుర్థాధ్యాయము.


| | | |
|---|---|---|
| సువదనోపాఖ్యానము | ... | 62 |
| కాశీమాహాత్మ్యము | ... | 64 |
| దివోదాసుచరితము | ... | 69 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| అనంతునిచరితము | ... | 73 |


## పంచమాధ్యాయము.


| | | |
|---|---|---|
| ఓంకారేశ్వరలింగము | ... | 77 |
| కృత్తివాసఈశ్వరుఁడు | ... | 78 |
| కపర్దీశ్వరలింగము | ... | ,, |
| మధ్యమేశ్వరలింగము | ... | 81 |
| వణిజానికథ | ... | 88 |


## కాశీయాత్ర.


| | | |
|---|---|---|
| తీర్థయాత్రావివరణము | ... | 93 |
| ఆయతనయాత్రావివరణము | ... | 97 |
| పంచక్రోశయాత్ర | ... | 99 |
| అంతర్గృహయాత్ర | ... | 109 |
| సప్తర్షియాత్ర | ... | 114 |
| అష్టాయతనయాత్ర | ... | 115 |
| అష్టభైరవయాత్ర | ... | 116 |
| నవగౌరీయాత్ర | ... | ,, |
| నవదుర్గాయాత్ర | ... | 117 |
| దశాయతనయాత్ర లేక నిత్యయాత్ర | ... | 118 |
| ఏకాదశమహారుద్రయాత్ర | ... | ,, |
| ద్వాదశాదిత్యయాత్ర | ... | ,, |




శ్రీ ఉమామహేశ్వరాయ నమః



# కాశీమాహాత్మ్యము

## ప్రథమాధ్యాయము.

శ్రీమంతంబును, జతురానన సన్నిభమహర్షి ధామం బును, నమందజ్ఞానలక్ష్మీప్రదంబును, నిఖిలస్తుత్యవిచిత్రవైభవ శోభితంబును, గంధర్వాప్సరస్సేవితంబును, జాతివైరంబు వీడి సఖ్యంబున నొప్పు మృగకులములచేఁ బరివృతంబును సాయ మివరులాసంగు ఘాసగ్రాసంబులఁ గుడుచు సారంగకిశోరభాసు రంబును నిరంతరయాగధూమవ్యాపృతనభోమండలమండితం బును, మునికన్యకాకృతవివాహావైభవశోభాయమానతరు లతాబృందవిరాజితంబును, వేదశాస్త్రపురాణేతిహాసోపన్యాస ప్రవీణకీరశారికాకోకిలవాదనాదమేదురంబును నానందదాయ కంబును నగు నైమిశారణ్య మను నరణ్యం బొండు పుణ్యప్రదం బై భరతఖండంబున నొప్పుచుండు. అందు యోగవిద్యావిశా రదులు, బ్రహ్మజ్ఞానతత్పరులు, ముక్తికాములు, లోకపూజి తులు, త్యక్తపాపులు, అపగతక్రోధులు, జితేంద్రియులు, భూత దయాపరతంత్రులు, విపులతపోధనసంపన్నులు నగు శౌనకాది మహర్షులు శిష్యగణసేవితులై యొక్కనాఁడు గుమిగూడి మోక్షంబునకు సులభోపాయం బగు మార్గంబు నెఱుంగఁ

దలంచి యన్యోన్యసంభాషణంబుల నొప్పుచుండ, యచ్చటికి వ్యాసశిష్యుండు, మౌనివర్యుండు, నిఖిలపురాణకథనచాతురీ విఖ్యాతయశుండు సూతుండు చనుదెంచెను. ఇట్లుచను దెంచిన నమ్ముని నమ్మునిరాజులు, భక్తివినయంబుల నర్ఘ్యపాద్యంబులం బూజలొనర్చి యున్నతాసన మిడి ప్రసన్నునిం జేసి, జగద్ధితార్థంబుగ, "సూతా! మున్ను సత్యవతీతనూభవునివలన సకలపురాణంబులు వినియుంటివి. నీ వెఱుంగని రహస్యంబులుగాన రావు. మాయందుం గరుణ యునిచి సూక్ష్మములో మోక్షము లభించు మార్గమును సాదరంబున నెఱింగింపు" మని వేడుకొనం జొచ్చిరి శౌనకాదిఋషుల మన్ననలకు ప్రార్థనలకు సూతుండు ముదమంది వారల విలోకించి, గురువరునకు నమస్కరించి, "తపోధనులారా! లోకహితంబు గమనించి మంచి ప్రశ్నం బొనరించితిరి. ఈరహస్యంబు తొల్లి భృగుమహర్షి లోమశాది మునివర్యులకు వినిపించిన తెఱంగున, ముక్తిసాధన మగు కాశీ క్షేత్రమాహాత్మ్యమును వివరించెద. చిత్తనిగ్రహుల రై, శ్రద్ధాభక్తుల నాలింపుఁడు" అని యిట్లు సూతుఁడు చెప్ప నుపక్రమించె.

ఒకానొక సమయమునందు నర్మదానదీతీరమున, భవభక్తాగ్రేసరుం డగు భృగుమహర్షి శాన్తచిత్తంబున నొప్పుచుండ, లోమశాదిమహర్షులు డగ్గరి, భక్తివినయంబుల నమస్కరించి "మహాత్మా, ఋషిసత్తమా! సర్వతత్త్వవిశారదా! కరుణావరుణాలయా! ధర్మవిదులు వేదాంతరహస్యంబులనుం బరిశీలించి, మాయామోహితు లగు శిష్యులకుం దత్సారంబు నుపదేశించి ముక్తితెఱంగు పొసఁగింతురు. అట్టి రహస్యంబులను గుఱు

తెలియంగిన మీరలు, సందిగ్ధహృదయులమై యజ్ఞానతిమిరంబునఁ దగిలి తెన్నుగానక వెతలంబడు మముబోంట్లకు ముక్తిమార్గమును జూపరే” యని పలువిధంబులఁ బ్రార్థింప, నమ్మునిచంద్రుఁడు వారలం గాంచి, సకరుణంబుగ, “మునివరులారా! మీర లడిగిన యర్థంబు సర్వజనమాన్యంబు. పరోపకారపూరితంబు. సమస్తపాపక్షయకరంబు. తపోమహిమంబున ధన్యతఁగాంచిన మిముబోంట్లకుఁ దత్త్వ మెఱింగింప, వేదాంతసారసంగ్రహుం డగు పితామహుం డైన సమర్థుండు కాఁజాలఁ డన నేనెంత? అయినను, మును గురువర్యులకరుణావిశేషంబువలన వినినదియు నేఁ గనినదియు సవిస్తరముగ వినిపించెద. ఇందులకు హృదయపంకంబుల విదళింపం జాలు నొక యితిహాసము గలదు. అయ్యది సావధానులరై వినుఁడు.” అని పలుకుచు, భక్తచింతామణి యగు శంకరునకు శరణాగతుఁ డై యిట్లు చెప్పఁదొడంగె.

కల్పాంతమందు, సూర్యచంద్రాదిగ్రహనష్టమై, పృథివ్యప్తేజోవాయ్వాకాశశూన్యమై యొప్పు మహాప్రళయమున, సత్త్వరజస్తమోగుణంబులు సమత్వము నొందఁ, బరమేశ్వరుఁ డయ్యవిరళమాయామోహంబునఁ జిక్కుపడి, చిరకాలము యోగనిద్రాపరతంత్రుఁ డయ్యె. అంత మేల్కాంచి తగు యత్నమున సృష్టి యొనర్ప బుద్ధి వొడమఁ బ్రకృతియును, బ్రకృతివలన నాకాశమును, దాన వాయువు, నందువలన వహ్నియు, వహ్నివలన జలము, జలమున భూమియు జననమయి క్రమంబున వృద్ధిచెందెను. ఇవ్విధంబున, సృష్టి భద్రపఱచుచు నీశ్వరుఁడు నిజభక్తవర్యులను బరిపాలింప, శ్యామల

కాంతితనుశోభితుండును, శంఖచక్రగదాపద్మభూషితచతుర్బాహుండును, కమలనేత్రుండును, పీతాంబరధరుండును, లక్ష్మీవిలసద్వక్షస్స్థలుండును, కౌస్తుభమణిభూషితుండును నై లీలాదేహధారియై భక్తకల్పద్రుమమై శ్రీమన్నారాయణాభిధానుండై విరాజిల్లుచుండె.

అంతఁ గొంతకాలంబున కతని నాభీకమలమున చతురాననుండు బ్రహ్మ యుద్భవించెను. పద్మమధ్యస్థుఁడై దిక్చయముఁ బరికింప, నెద్దియుం గానరామిఁ ధాత మోహితుఁడై, "యీసమస్తచరాచరాళికి నేన సర్వప్రభుండ" నని యహంకారభూయిష్ఠుఁడై గర్వము నొందుచుండెను.

## బ్రహ్మవిష్ణువులకలహము.

పద్మగర్భున కజ్ఞాన మంకురించుట మది నెఱింగి, సుజ్ఞానిగఁ జేయఁ దలంచి హరి యాతని యెదుట ప్రకటరూపమున "నీ వెవరు" వని యడుగ, బ్రహ్మ "ఈసమస్తచరాచరవర్గంబునకు సృష్టికర్తను; అధినాథుండను" అని బదులు పల్కెను. అంత, నారాయణుఁడు "అహో! మాయాజాలంబునఁ జిక్కుపడి మందబుద్ధివై, నీవు జనించిన పద్మమునకును నీ సమస్తసృష్టివర్గంబునకును గారణభూతుండ నగు నాది పురుషుని నన్నెఱుంగక పల్కుచుంటివి. నా తేజము ప్రభావముఁ గని, నాప్రభుత్వ మంగీకరించి నాకు శరణాగతుఁడవై మత్పదద్వంద్వమును హృదంతరంబున నిల్పి సుస్థిరుండవై ప్రవర్తింపుము. దాన నీకు మే లొనఁగూడు" నని ధాతను మందలింప నతఁడు "నేను పూర్వజుఁడను, నీభూతంబులకు సృష్టికర్తను;అధినాథుండను.నాకుశరణాగతుఁడవై మనుము"

అని నారాయణునకు బదు లొసంగెను. ఇట్లు హరివిరించు లుభయులు సృష్టికర్తను అధినాథుండను ఆదిపురుషుండను నేన నేన యని వాగ్వాదము లొనరించి, రోషమ్ములు ముమ్మ రింపఁ దమతమప్రభావముల నస్త్రశస్త్రముల నుత్పన్న మొన రించి ఘోరతరమ్ముగఁ బోరఁదొడఁగిరి. శరీరంబుల రక్తధార లొలుక, ఖరశస్త్రాస్త్రవిభిన్నదేహు లగుచు రోషావిష్టులై బహుకాలము పెనంగినను మచ్చరములవీడక, యొకరి కొకరు లొంబడక జయకాంక్షలు హృదయంబులఁ బురికొల్ప నుత్సా హంబునఁ బోరు సలుపుచు నలభ్యవిజయులై తమతమ హృద యంబుల వితర్కించుచుండ, తన్మధ్యంబున శరచ్చంద్రాయుత ప్రభాభాసురభాసమాన తేజోమయజ్యోతిర్లింగము పొడ సూప బ్రహ్మావిష్ణువులు నిశ్చేష్టత నొంది వికలచిత్తులై "ఇది యేమి? ఈలింగశరీరధారుఁ డెవఁడై యుండు" నని విచారింప మొదలిడిరి.

## విశ్వేశ్వరలింగప్రాదుర్భావము.

అంత వారియెదుట, పింగళకపర్దకాంతులు జటామకు టంబునఁ బ్రజ్వలింప, ముండమాలావిరాజమానుండు, దిగం బరుండు నగు మహాపురుషుండు ప్రత్యక్ష మయ్యె.

తమ కట్టెదుట కోటిసూర్యప్రభల మించి వెలుఁగొందు పరమపురుషు నీక్షించి "యీతఁడు పరమేశ్వరుం డగు శంక రుండు గానోపు. కానిచో నిట్టి భవ్యతేజ మలవడ నేరదు." అని కృతనిశ్చయులై, ముకుళితకరకమలులై, సభక్తికముగ సువ్యక్తవేదోక్తమార్గంబున స్తుతి యొనరింపఁ బశుపతి సాద రంబునఁ గమలజకమలాపతుల నీక్షించి, "మీ రుభయులు

నీజ్యోతిర్లింగమును దర్శించి భక్తియుక్తముగఁ గొనియాడి తిరి. మీభక్తికి సంతసించి ప్రసన్నుఁడనైతి. మీకోరిన వరంబు లొసంగెదను. వేఁడుఁ" డని పలికెను. బ్రహ్మవిష్ణులు, భవానీపతి పలుకుల కలరి, "దేవా! మాయందుఁ బ్రసన్నుఁడ వైతి వేని, నీయీజ్యోతిర్లింగమునందు మది తొలంగకుండ, దృఢతరభక్తియుక్తులమై యుండునటుల వరప్రదాన మొసంగుము. మఱియు, నీలింగరాజ మిటనిటుల వెలుంగు కారణ మేమి? ఇద్దాని నామ మెద్ది? దీని మహిమము దేవరగాక నిఁక నెవ రెఱింగింప సమర్థులరు? దీని సవిస్తరముగ నెఱింగించి మాహృదంతరంబులనాశ్రయించిన యజ్ఞానమును దొలఁగింపఁజేయుఁ" డని ప్రార్థింప,

## విశ్వేశ్వరలింగమహిమ

విశ్వనాయకుఁడు, "ఈలింగము విశ్వేశ్వరలింగ మని ఖ్యాతిగాంచిన దయ్యె. ఇచటఁ బ్రవేశించిన మాత్రమున, జనులు పూర్వజన్మకల్మషపుంజమ్ముల నాశ మొనరించి, పుణ్యసమృద్ధి గనుచుందురు. ఇట ప్రాణిమాత్ర మెద్దియైన శరీరత్యాగ మొనర్చునెడ నీశ్వరుఁడు తారకోపదేశ మొనరించి బ్రహ్మజ్ఞాన మలవఱచి తప్పక ముక్తి నొసంగుచుండు. సచ్చిదానందస్వరూపుఁ డగు నీశ్వరుఁడు తన యిచ్ఛవలన లింగరూపమున వెలుఁగొందుచు, తద్రూపంబున సర్వభూతాంతరవర్తియై, యపవర్గసాధనుఁడై యపరిమితానందమయుఁడై, భక్తజనకింకరుఁడై, సకలదేహుల కాత్మయై, దేహవిశ్లేషకాలమునఁ దారకోపదేశ మొసంగుచుండు. ఎట్టి మహాత్ముఁడైనను, బ్రాహ్మణుఁ డైనను, నంత్యజుఁ డైనను, బండితుఁ

డైనను, బామరుఁ డైనను నీక్షేత్రమున శరీరత్యాగ మొన రించిన, నిరంతరమోక్ష మవశ్య మలవడును. ఈవిశ్వేశ్వర లింగ మిట శాశ్వతముగ నుండు. మీ రుభయులు నీలింగ మందు దృఢతరభక్తియుక్తులరై జ్ఞాన మలవఱచుకొనుఁడు" అని యివ్విధంబున లింగ ప్రభావమును హరివిరించుల కెఱుక పఱచి మహేశ్వరుఁ డంతర్ధానము నొందె.

అంత పద్మజుండును బద్మనేత్రుండును బటుతరరోషం బులు వీడి ముదంబున దమతమ తావుల కరిగిరి.

"మునివరులారా! మీర లడిగిన యర్థము మోక్ష దాయకము. మహేశ్వరుఁడు భారతీకమలాపతులకుఁ జెప్పిన తెఱంగున విశ్వేశ్వరలింగ ప్రభావమును మీ కెఱిఁగించితి. హరియు బ్రహ్మయు నీలింగము నెచట దర్శించిరో యాస్థలము కాశియని లోకములయందును, వేదములయందును వాసి గాంచిన దయ్యె. కాశిని గాంచినంతనె కలుషము వేయి విధ ముల హరియించు. కరతలామలకము వోలె ముక్తిఁ గనఁ జనును." అని భృగుమహర్షి విన్నవించిన జ్యోతిర్లింగ ప్రభావ మును, కాశీక్షేత్రవిశేషమును నిశ్చలచిత్తులై యాలించి, లోమశాదిమహామునులు "ఋషిపుంగవా! యీదినంబునఁ దమ ముఖకమలమునుండి వెలువడినకాశీమాహాత్మ్యకథనా మృతమును బాన మొనర్చెడు భాగ్య మలవడిన కతన మాజన్మంబులు సఫలము లయ్యె. మాతపంబులు ఫలవంతము లయ్యె. కాశీక్షేత్రమహిమావిశేషమును, దాని సేవా విధియుఁ బూర్వమం దెవరి కెట్టి ఫలము కల్గెనో, వార లెట్టి పాపమువలన విముక్తిగాంచిరో, సవిస్తరముగ వివరింపుఁ

డని” ప్రార్థింప: భృగుమహర్షి “మునివరులారా! కలుషహారములగు కాశీమహిమలఁ దెలుపుకథ లనేకములు గలవు తెల్పెదను. సావధానముగ వినుఁడు:—

### భూరిద్యుమ్నమహారాజుకథ

కృతయుగమునందుఁ బలప్రతాపముల నమరేంద్రుని సాటియై యష్టైశ్వర్యంబుల కిరవై, భూరిద్యుమ్నుఁ డను రాజు భూపరిపాలనముఁ జేసెను. అతఁడు లక్షకన్యారత్నములఁ బరిణయ మాడి వనితాలోలుఁడై, మంత్రివర్గ ముపదేశించు హితవచనంబులఁ బెడచెవుల నిడుచు మారక్రీడలఁ దేలుచుండెను. భూరిద్యుమ్నునకు శతసహస్ర వనితారత్నములలోఁ గడుం గూర్చు ప్రియురాలు విభావరి యను పట్టమహిషి. వా రుభయులు, వాసవిలాసముల తెఱంగున, వనములఁ బర్వతముల సరస్సులఁ బుష్పవాటికల విహరించుచు రాజ్యంబు పూజ్య మొనర్చి, చిరకాలము గడపినవా రైరి. స్త్రీలోలుఁడై రాజ్యపాలనంబునఁ బరామరిక లేనికతన ధనము శత్రుమిత్రుల పాలయ్యె. చతురంగబలములు క్షీణములయ్యె. భూపుఁ డపాత్రుఁ డని మంత్రివర్గం బన్యరాజుల నాశ్రయించె. రాజకార్యములు చెడిపోయె. కతిపయదినములకు శత్రురాజులు పట్టణము నరికట్టిరి. అంత రాజశేఖరుఁడు, తనవా రెల్లరు విడనాడుటయు, రాజ్యంబు శత్రుల పా లగుటయు నెఱింగి ధీరత చెడి సేయు నది లేక విభావరీసహితుఁడై, ఖడ్గపాణియై, వింధ్యపర్వతప్రాంతారణ్యంబుల కరిగి క్షుత్పిపాసలకు లోనై కడుం దూలుచు, భీకరక్రూరమృగసంఘాతంబు గాంచుచు బహుదినంబులు సంచరించెను.

అంత విభావరి, క్షుత్పిపాసాకులురాలై కడుం దూలి విన్న నగు మొగంబున నొప్పు భూరిద్యుమ్నుని విలోకించి, "మహా రాజా! ప్రాణనాథా! మీ కెట్టి దురవస్థ సంప్రాప్తం బయ్యె, విధిని ధిక్కరింపఁ దరంబు గాదు గదా! ననుఁ గూడి యీఘోరారణ్యంబున కరుదెంచితిరి. ఎటు చూచినను శరభ శార్దూలాదిభీకర క్రూరమృగసమూహంబు దక్క, త్రాగుట కించుక జల మైనను గానరాదు. ఇందు మన మెట్లు జీవింపఁ గలము? నిర్మానుష్య మగు నీకాంతారంబున మనము వెల్తు లమై యన్నపానంబుల నాశించుచుంటిమి? అడవి నన్నోదకంబులు కల్గు టెట్లు? బహుశోషదలకుఁ బాల్పడి, కాంతిహీన మగు మీముఖపంకజంబుఁ జూడ నామనంబు నీ రగుచున్న యది. కట్టా! చేయున దెద్దియుఁ గానరాదు? కర్మవశము మాన్ప శక్యమా?" అని పలుక, భూరిద్యుమ్నుఁడు "కాముకు లెంతటిఘను లైనను దప్పక చెడుదురు. సంపత్తి గల దినములలో ధర్మార్థమోక్షసాధనముల కను వగు సనాతనధర్మములఁ దూలఁజేసి, కేవలకాముకుఁడనై, భోగవాంఛలయెడ నుత్సాహంబున మనంబు నిడి, మంత్రివర్యుల హితవచనంబుల నిరాకరించి, యిట్లు తత్ఫలము ననుభవించుచుంటిని." అని జవ్వనితోఁ బలికి, "నీచపుఁబనుల మెలఁగినవా రెవరు చెడకుందురు?" అని తనలోఁ దా గొణుఁగుకొనుచుఁ దన తప్పును దా నొప్పుకొనుచు, రాణితో మారు వలుకఁడాయె. ఇవ్విధంబున నైదు దినంబులు కాంతారంబున గుట్టల పుట్టలం దిరిగి తిరిగి పూర్వభవపుణ్యావశంబున, శాలంకాయనముని యాశ్రమముఁ జేరిరి. రాజదంపతులకు, శాలంకాయనుఁడు సకరుణం

బుగ నాతిథ్య మిడి, యర్ఘ్యపాద్యాదులఁ బూజ లొనర్చి ఫల మూలాదుల నర్పించి, తృప్తులం జేయ, సంతసంబున నాఁటి రాత్రి తదాశ్రమమున సుఖనిద్రం జెంది, మఱునాఁడు ప్రాతః కాలమునఁ గాంతారవీథుల సంచరింపఁ బయలువెడలిరి. వారి దుష్కర్మపరిపాకముచే, వింధ్యకాననాంతరమున, బహుదినం బులు ఫలమూలాదులు లభింపమి, ముఖంబులు వాడఁబాఱె. పదంబులు తొట్రుపడఁ జొచ్చె. నిట్టూరుపులు విపులము లయ్యె. తాపంబు లతిశయములు గాఁదొడంగె. దాహంబు లధికము లయ్యె. ధైర్యంబులు విలోలంబు లయ్యె. మనం బులు వికలంబు లయ్యె. రాజునకు నోటమాట రా దయ్యె. అంత రాజు తన ప్రియురాలిని వధించి, తన్మాంసమును భక్షించి, రుధిరంబు పానంబు చేసి క్షుత్పిపాసల నడంచుకొన మనంబు పాడమె. అయ్యాది విభావరి గ్రహియించి, సంతసం బున, సభక్తికముగ, భర్తం జీరి, "జీవితేశ్వరా! నామనవిని చిత్తగింపుము. నీవు క్షుద్బాధచేఁ గడు డస్సియుంటివి. నన్ను వధించి నాపొలసు భక్షించి నీతనువు నిలువఁబెట్టుకొనఁదగు. ఆలస్య మేల చేసెదు? కష్టంబులం బాసి సద్గతిఁ జేర, శీలము గల సతులకు, పతులు జంప భద్ర మగుఁగదా! మఱియును, ప్రభురక్షణమునకుఁ బ్రాణంబు లర్పించువారలు శాశ్వత మోక్షపదంబు వడయుదు రని పెద్దలు వలుకుదురు. సతులు ప్రాణంబుల నైన నర్పించి పతులను గాపాడుట పరమధర్మ మని బహుగ్రంథములఁ జెప్పఁబడి యుండెను. మఱియు నాపద్వి మోచనమునకు ధనసంరక్షణము ధర్మ మనియు, దాన, దారను రక్షించుట పరమధర్మ మనియు, ఆత్మసంరక్షణము ధనముచే

నైనను దారచేనైనను నొనర్చుకొనుటయధికతరధర్మమనియుఁ
జెప్పఁబడి యున్నది." అను విభావరి పలుకుల నాలించి, కని
కరము మాలి, దనుజభావము వహించి, తచ్ఛిరమును ఖండించి,
తన ప్రియమాంసమును నప్పాపభాక్కు భక్షించుటకు నుద్య
మింప, నది గని భీకరక్రూరసింహములు గర్జనలు సేయుచుఁ గాన
నమున బయలువెడలెను. అంత రాజు ప్రాణభయమున బలము
విడనాడి జీవితాశను యోజనదూరము పరుగిడ, నివ్వరిధాన్య
ముల సంగ్రహించి గృహంబుల కరుగు బ్రహ్మచారుల నల్వురం
గాంచి, యాకలిదప్పుల నడంపఁ గోరి, వారల భక్షింప నెంచి,
తన ఖడ్గంబున నల్వుర నొక్కుమ్మడి దూలనేసి, నీవారంబుల
భక్షింప నుపవిష్టుఁ డయ్యె. అయ్యవసరమున వారల మృగా
జినయజ్ఞోపవీతంబుల నీక్షించి బ్రాహ్మణులుగాఁ దలంచి,
బ్రహ్మహత్యాపాతకంబునకు వెఱచి, విహ్వలహృదయుండై,
మూర్ఛవడి, తెప్పిరిలి, తనలోఁ దాను, "నాశరీరపోషణము
నకు గదా, కాననచారులు, బ్రహ్మవిదులు, వేదశాస్త్రపారంగ
తులు, కుశసమిత్పుష్పభారులు, బ్రహ్మచారులు నలువుర నసు
రునుండి యెడఁబాపితి. పతివ్రతాశిరోమణి యగు సతిని
జంపిన సాహసునకు నాకుఁ జేయరాని దెద్ది గలదు? స్త్రీ
హత్యయు, బ్రహ్మహత్యయు, పరంబున కిసుమంతయు వెలువక
ఒనర్చితి. ఇఁక నాబ్రతు కేల! కాల్పనా! అయ్యయో! తిండి
కొఱకై కులసతిని బాపమని తలంపక సంహరించితిని. బ్రహ్మ
చారుల మార్గ మరికట్టి చంపితిని. ఒక బ్రహ్మహత్య నొనరిం
చిన, నూఱు కల్పాంతములవఱకును గాలకింకరుల యధిక
తరబాధల ననుభవించుచు నరకకూపముల వాస మొనర్చు

నెడఁ బాప మని తలపెట్టక నలువుర బ్రాహ్మణులను, నొక స్త్రీ రత్నమునుఁ బొలియించితిని. ఇందువలన మత్కులజులు నూటొక్క కులములవారు నరకమునఁ బడియెదరు. ఇంతకు మున్నే పడియుందురు. భస్మీభూతు లయ్యేయుందురు. నా వలన నూటొక్క కులములు దుర్గతి పా లగు పాపము సలుపఁ బడెను. ఈకిల్బిష మెట్లు వాయును? దీని మాన్పు ప్రియుఁ డెటఁ గల్గును?" అని యీరీతిగ భూరిద్యుమ్నుఁడు దుఃఖార్తుఁడై, సంతాపమును జెందుచు "నెవరును మాన్పఁజాలని యఘసంచకము నిట్లుచేసితినే! కాలుఁడు నను విడఁజూచునా! ఈకానలో నాకిఁక ది క్కెవరు? పరమపవిత్రు లగుబ్రహ్మవిదులఁ జంపిన నావలన ఖరకరకులసంజాతులకుఁ గల్గనిదుర్దశ గల్గె! నావంటి కిల్బిషకరుని, నీచుని నుద్ధరించు కరుణాత్ముఁడు భవ్యుఁడు లభ్యుఁ డగునా?" అని యిట్లు బహుదినంబులు రేయింబవళు లెఱుంగక, నిద్రాహారంబులఁ దలంపక, పశ్చాత్తప్తుఁ డగుచు విలపించుచుఁ జనిచని, యొకచో, సంసార దుర్బీజనిర్మూలపటుతరతపగ్రప్రభాభాసురుఁడు, కరుణాపారీణుఁడు నగు శాలంకాయనమునిపుంగవుని గాంచినవాఁ డయ్యె. అట్లు గాంచి, భూరిద్యుమ్నుఁడు, దూరంబున నిలిచి, సాగిలఁబడి నమస్కరించి వనట మునుంగుచు దాఁచక దన వృత్తాంతమ్ము సాంతమ్ముగ నమ్మునివరునకు విన్నవించెను. భూరిద్యుమ్నుని చరితము తన్ముఖంబున శాలంకాయనుఁడు విని, నివ్వెరపడి, రాజుం జూచి, "యేమేమి? మరల నీదు చరితము వినుపింపు" మన నృపుఁడు తిరిగి వినుపింప విని, బహుదుఃఖితుఁడై "దురాత్ము లిచట నిలువఁ బొసఁగదు. ఇచ్చోటు

వాసి జాగుసేయక యెందేని పొమ్ము. ఉపిజు లైనను మాన్పం జాలని విస్తృతపాపమొనర్చితి" వని పలుకుచుం "గుటిలులం గనంగూడ" దని పరాఙ్ముఖుం డయ్యె.

మాఱుమొగ మిడిన శాలంకాయనముని పదపనజంబులం బడుచు లేచుచు, దైన్యమున వాపోవుచు, నమ్రభావమున రక్షింపు మని వేడుచు వదలని రాజుం జూచి, మునిపుంగవుఁడు కరుణాంతరంగుఁడై, "సమస్తపాపములను క్షయ మొనర్చు కాశికాపురవరంబునకు శీఘ్రంబునఁ జనుము. కాశీదర్శనమాత్రమున సకలకలుషములు పడలును. అచ్చట మృతిఁ జెందిన పిపీలికాదిజంతుసంతతి యైనను మోక్షమును జెందును. శీఘ్రంబున నరుగుము. జాగుసేయకుము. నీకలుషము లడంగును. ఇందులకు నిదర్శనముగ నీ నీలిమకంచుకపంచకమును ధరియింపుము. నీవు వారాణసి చనినంతనె యీకంచుకపంచకము నీలిమను బాసి ధవళత్వముఁ జెందును. అట్లే నీవును నీయఘపంచకమును బాసి నిర్మలుఁడ వగుదు"వని నీలిమకంచుకముల నొసంగఁ గాశీయాత్రాలోలమనస్కుండగుచు, వైశమవానిని ముదంబున ధరియించి, మునివర్యునకు నమస్కరించి, తదనుజ్ఞ వడసి యాశ్రమంబును వీడి బయలువెడలెను.

అట్లు రాజు రాత్రిందివములు పరుగాడుచు భువింగల సమస్తతీర్థంబులం గ్రుంకులిడుచు, పుణ్యక్షేత్రంబులు సేవించుచు, నీలిమపరిధానము లెప్పటి యట్ల యుండుటం గని మది చింతిల్లుచుఁ బుణ్యవశంబున సప్తదివసములకు కాశికాపురమును గాంచెను. అదియు, నభినవయౌవనలక్ష్మీవిలాస

భాసురవిలాసవతుల చేతను, ప్రచండచండభాను తేజఃపుంజ ప్రభాభాసమానభవ్యవజ్రమణివారనిర్మిత విశాలసౌధరాజంబుల చేతను, ఫలపుష్పగుచ్ఛభారవహశాఖాశోభితకదంబనింబ కరవీర సహకార పూగపున్నాగ ప్రకరభూరుహవిరాజమాన సుందరోద్యాన వనసంతతుల చేతను, శుకపికశారికాదిమనోహరపక్షికులకలరవముల చేతను, రథాశ్వవేదండతండంబుల చేతను, సకలవిద్యాపారంగతు లగు విప్రవరుల చేతను, బహుశాస్త్రశస్త్రపారగులై, ధైర్యస్థైర్యసాహసోత్సాహంబుల నొప్పు క్షత్రియకుమారుల చేతను, లెక్కకెక్కుడగు ధనంబుగల వైశ్యకులజుల చేతను, సమస్తధాన్యంబులం దులదూగుచు దేవబ్రాహ్మణభక్తితత్పరులగు శూద్రుల చేతను, బ్రహ్మానుసంధాననిష్ఠాగరిష్ఠు లగు యోగిశ్రేష్ఠుల చేతను, హరనామసంకీర్తనానందతత్పరత్వంబున నొప్పు భక్తవర్యుల చేతను, పదనశంఖ కాహళ ఢక్కా డమరుకా ద్యనేకవాద్యవిశేషంబులం బ్రతిధ్వను లొసంగు దిక్చయము చేతను, నొప్పు మిగులుచు, నానందవనంబై, యవిముక్తంబై గౌరీముఖమై, త్రికంటకవిరాజితంబై, మణికర్ణికాక్షేత్రంబై, త్రయస్త్రింశత్కోటిదేవతాసేవితంబై, అశీవరణామధ్యగతంబై, పంచక్రోశాత్మకంబై, శతకోటిశశిశేఖరలింగస్థాపితంబై, భాగీరథీవిలసితంబై, విశ్వనాథపురవరంబై మిగుల నొప్పారుచుండు. భూరిద్యుమ్నుఁడు కాశికాపురంబునఁ బ్రవేశించి, యద్దాని మనోహరశోభావైభవముల కచ్చెరు వొందుచుం దా నొనర్చిన దోషంబులు బాఱఁద్రోల గంగానదిని గ్రుంకు లిడి విశ్వేశ్వరసందర్శన మొనర్చెను.

తాపసవరులారా! భూరిద్యుమ్నుఁడు కాశీపురము ప్రవేశించిన నిమిషముననె యతఁడు ధరియించిన నీలవస్త్రములు ధౌతవర్ణంబులై శరచ్చంద్రచంద్రికాప్రభాభాసురంబులై వెలయఁ జొచ్చె. అంత భూరిద్యుమ్నధాత్రీశుఁడు, తన కలుషంబులు దూర మగుట నెఱింగి ముదంబున నుప్పొంగుచు, విధ్యుక్తముగ విశ్వేశ్వరు నారాధించుచు, కాశి పుణ్యరాశి యని గీర్తించుచు, దేవనదీలలామంబునఁ గ్రుంకు లిడుచు జీవితకాలమంతయు నటఁ గడపెను. అంత్యమున విశ్వనాథ బోధనామృతపానంబువలన బ్రహ్మైక్యము నొందెను. మునిపుంగవులారా! కాశీపురమరణంబునఁ బూర్వభవపాపసంచయము లెల్ల నాశ మగును. కైవల్యము ప్రాప్తించును. కాశీపురంబున, వనభూమ్యాకాశములం దెచ్చట మనుజుఁడు ప్రాణంబులు విడచినను, పాపి యైనను సద్గతి నొంది కైవల్యము గాంచును. పుణ్యాత్ముల సంగతి నిఁక చెప్ప నేల?

కాశి యను వర్ణద్వయము నంత్యకాలమున స్మరించుచు శరీరత్యాగ మెచ్చట నొనర్చినను శాశ్వతకైలాసవాసము లభించును. ఇందుల కొక యితిహాసము గలదు. చెప్పెదను వినుఁడు:—

## కృశునికథ.

పూర్వకాలమునఁ గురుక్షేత్రమున భాలుకి యను విప్రవర్యునకు, రత్నముల గనియందు ఱాయివలెఁ దులసీవనంబునఁ గంజాయి మొలకతెఱంగునఁ గృశుఁ డను కొమరుం డుదయించెను. ఆతఁడు పింగాక్షమునివలన సాంగోపాంగముగ

వేదశాస్త్రముల నభ్యసించి, విధివిధానంబులఁ గ్రహించి లాక్షణికుఁడై చిన్నతనముననే పేరు వడసెను. అంత కొంత కాలమున కాతనికి దైవనియతిగఁ బాల్యంబు వీడి యౌవన మంకురించెను. అతఁడు బ్రహ్మకులసంభవుఁ డయ్యు ననూనాచారంబుల వెడలనడఁచి యధర్మవర్తనుఁడై, తస్కరదురోదరంబులఁ దవిలి, పింగాక్షమున్యాశ్రమమున, సంగడికాండ్రఁ గూడి, కులపాంసనుఁడై, ధర్మమునందు మది చొరనీక, బలియుఁడై పాపకార్యములు సలుపుచుండెను. భాలుకపింగాక్షులు కృశునకు ధర్మోపదేశ మొనర్చిరి. గాని, వారలఁ గేలియొనర్చుచు జడుఁడై నిరంతరము పరస్త్రీపరధనలోలుఁడై ప్రవర్తించుచుండెను. అంతఁ దలిదండ్రులు వాని చెయ్దములను గని మదిఁ గుందుచుఁ గుమారుని జేరం జీరి, "కుమారా! బ్రహ్మకులజులకుఁ దగు నియమములు నీయందుఁ గానరావు. మా మాటల నాలింపుము. మన పెద్దలు కర్మఠులు. వారల గౌరవమును బాటింపుము. దైవకృపవలన మనకు సమస్తసంపదలును గలవు. దుష్ప్రవర్తనములనుండి దొలఁగుము. దుండగపుఁబనులు, దుష్టచేష్టలు వీడకుండినఁ గులీనులును నిన్నుఁ జూచి రోయకుందురా? మా మాటలఁ బాటించి దుర్వ్యసనముల వీడి సాటివారిలో వాసిగాంచుము." అని మందలింప, వారి పలుకుల సరకుగొనక, మాతృసపత్ని యగు సంనీతిని, గురుపత్ని యగు హైమవతిని బొందుచు వారలఁ బిలుచుకొని మధురాపురంబున కరిగి వారలను గామతంత్రాధిదేవతలగా మది నెన్నుచు, మన్మథక్రీడాపరతంత్రుఁడై రేయింబవళులు వారిని వదలక తిరుగుచుండె. ఇట్లు పండ్రెండు వత్సరములు

ద్యూతచౌర్యంబుల ధన మార్జించుచు మదిరాపానమత్తుఁడై గురుపత్నులఁ గూడి స్వేచ్ఛావర్తన మొనర్చెను.

అంతఁ గర్మపరిపక్వమున గురుపత్నులు ప్రాణంబులు వీడఁ బ్రియురాండ్ర మరణంబునకు దుఃఖించుచు జీవనాధారంబు గానక మధురాపురంబు వీడి, కళింగదేశ మరుదెంచి, దాతల యాచించుచు, దుర్దశల ననుభవించుచు, భుక్తికి లేమిఁ జింతించుచు, దినములు బుచ్చుచుండెను. అంత, కొంతకాలమునకుఁ దీవ్రజ్వరార్తిపీడితుఁడై, "నేను పుట్టినది మొదలు నేఁటివఱకును బాపకార్యములనే గాని పుణ్యకార్య మొక్కటియైనను జేసి యుండలేదు. నాకు సద్గతి లభించు టెట్లు?" అని చింతించుచుండు సమయమున, దైవానుకూలమునఁ గాశీకథావిశేషము జ్ఞప్తికి వచ్చి 'కాశి' యను నక్షరద్వయము స్మరించుచుఁ బ్రాణంబులు విడిచె. వెంటనే కాలకింకరులు పాశంబుల బంధింపఁ దొడంగిరి. ఆ సమయంబునఁ ద్రిశూలపాణులై శివగణము లరుదెంచి యుత్తమవిమానారూఢుం జేసి శివలోకమునకుఁ గొంపోవుచుండుతఱి యమభటులు శివభటులఁ గాంచి "మీరలు ధర్మజనప్రియులు. వీఁడో యధర్మవర్తనుఁడు, మహాపాపాత్ముఁడు. అట్టి వీనిని మీర లేకారణమున శివలోకమును జేర్చుచుంటిరి" అని యడుగ "వీఁడు మహాపాపాత్ముఁడైనను మరణకాలమున 'కాశి' యను నామమును స్మరింపుచుఁ బ్రాణములు వదలెను. అందువలన వీని పాపము లన్నియు నశించెను. వీఁడు కైలాసమున యుగపరిమితకాలము వసియించి తదనంతరమునఁ గాశీపురంబున జనన మొంది ముక్తిఁ

జెందును" అని శివగణ ముత్తర మొసంగి కృశుని సూక్ష్మ శరీరమును గైలాసమునఁ జేర్చెను.

పిదపఁ గాలకింకరులు కాలునిఁ జేరి కృశునివృత్తాంతమును విన్నవించిరి. యమరాజు "కాశీపట్టణమున మరణము నొందువారలకును మరణకాలమున 'కాశి' యను నామమును స్మరించువారలకును శివభక్తులకును విష్ణుభక్తులకును దీర్ఘయాత్రాసేవాపరతంత్రులకును నే నధిపతిని గాఁజాలను. వారలనెఱింగి యప్రమత్తత మెలంగుఁడు" అని తన దూతలకు నాజ్ఞనిడి పనిచెను. మునివరులారా! మీకుఁ గాశీమాహాత్మ్యమును వినిపించితిని. ఇందువలన సమస్తపాపములుఁ క్షయ మగును.

ఇది ప్రథమాధ్యాయము.



# కాశీమాహాత్మ్యము

## ద్వితీయాధ్యాయము.



భృగుమహర్షి లోమశాదిమహర్షులకుఁ జెప్పిన తెఱంగున సూతుఁడు శౌనకాదిమహర్షులకుఁ గాశీకథావిశేషమును విన్నవించి మరల నిట్లు చెప్పఁదొడఁగె:—

### కాశీక్షేత్రప్రభావము.

మునివరులారా! పుణ్యరాశి యగు కాశిమహిమంబు ముక్తినిదానంబు, సకలసంశయనివారణంబు, యోగసులభంబు, పరమపదసాధనసూక్ష్మంబు, అనాయాసముక్తిదంబు. కాశియందు నీశ్వరుఁడు తన్ను నిశ్చలభక్తిని సేవించుచు సన్మార్గమున మను బ్రాహ్మణు నైనను సమత్వమున మది నెన్నుచు నంత్యకాలమునఁ దారకమంత్రము నుపదేశ మొనర్చును. వారాణసియందు మృతి నొందు ధర్మతత్పరు లీశ్వరోపదేశ తారకమంత్రరాజము కర్ణపుటములఁ బడు క్షణముననే కలుషముల వీడి మోక్షమును బొందెదరు. అధర్మవర్తనులు దేహమును ద్యజించి రుద్రపిశాచయోనింజనించి భైరవదండనాతిశయానుభవానంతరమున విగతకలుషులై తత్కృపావిశేషమునఁ దారకంబు వడసి విశ్వనాయకుని పజ్జఁ జేరుదురు. కాశీక్షేత్రమున నొనరించు నొక్కొక పాపమునకు నయుతత్రయవత్సరములు రుద్రపిశాచత్వము ననుభవింపవలయును.

అందువలనఁ గాశియందుఁ బొరబడి నైనను గలుష మొన కింపఁ జనదు. ఒనరింపఁ దలఁపను జనదు. కావున విశ్వనాథుని మనంబున నిల్పి తుచ్ఛ మగు భావిసుఖముల నపేక్షింపక భవ్య ముముక్షుపదము నభిలషించి స్వధర్మపరులై సేవించు భక్తులను నద్దేవదేవుఁడు కృపాతరంగితాంతరంగుఁడై ప్రోచుచుండును. విశ్వనాథపురవరము ముముక్షుపదము, ధర్మభూయిష్ఠము. అందు నివసించు ధర్మావలంబి తనతోఁ బూర్వాపరముల నూర్వురేసి వంశజులను దరింపఁజేయును. ఇంద్రియములవలనఁ జేకూరు కలుషములు కాశీకాప్రస్థితులఁ బొడఁగాంచినఁ దొలఁగిపోవును. కాశి కరిగెద ననిన మంగళప్రాప్తియు, గన నేగిన శుభపరంపరయుఁ జేకూరును. స్వధర్మపరతంత్రమునఁ గాశియందు నివసించువారల కాశావిలంబములు లేక వేవేగ సాయుజ్య మొనఁగూడును. ముక్తిద మగు వారాణసిని నివసించుమనుజులకుఁ బాపవిముక్తియు, సాధుజనభక్తియు, నీశ్వరగుణగణచింతనానురక్తియు నలవడును. అచ్చట సురదీర్ఘికయు, మణికర్ణికయు, విశ్వనాథుఁడును, తీర్థసంతతులును సకలప్రాణుల పూర్వభవకలుషముల నడంచుచు విచ్చలవిడి పుణ్యపరంపరల నొసంగుచుండును. అచ్చట నొనర్చిన హవనము, దానము, ధర్మము, జపము, తపము స్వల్ప మైనను దత్ క్షేత్రప్రభావమున భూరితరమై యనంత ఫలప్రదాయకమై యొప్పుచుండును. అచ్చట ధర్మమార్గావలంబినై మృత్యువు నపేక్షించి నివసించు మనుజుఁడు స్వల్పకాలమున ననాయాసముగ ముక్తి వడయఁ గలుగును. కాశీపురము ముక్తిదాయక మను నంశమున సంశయము గల

మనుజులకు వారి ప్రాణప్రయాణసమయమునఁ బ్రమాణ భూతుఁడై పరమేశ్వరుఁ డాసందియమును బోఁగొట్టును.

గంగాభవానీమణికర్ణికావిరాజమానమాననీయంబగు కాశీక్షేత్రమున ముక్తి వడయుట కేమి యాశ్చర్యము ?

కాశీయాత్రాప్రయాణమునకు సమయము లన్నియు శుభప్రదములు. తిథిముహూర్తవిచార మనవశ్యము. కాశీ యాత్ర కరిగెడు మనుజులకు విఘ్నము లొనగూర్ప దేవ గణము లుపస్థితులై యుండురు. వారల సరకుగొనక ముక్తి ప్రకాశిక యగు కాశికిఁ జనవలయు.

కాశికాపురకాఁపురంబు విడువఁ జనదు. జీవితకాల మచట విసువక గడుప నగు. కరకంఠుఁడు సాదరమున మోక్ష మొనగూర్చు. శంకరుని తారకం బెలుఁగఁ గారణం బగు కాశికాపురవరకాఁపురంబు నిష్పంకిలుఁ డెవ్వఁ డైన వీడఁ దలంచునా యను భృగువచనంబులు విని మునివరులు, "మహాత్మా! పూతచరితా! పుడమి ననాయాసముగ ముక్తి నొసంగు విశ్వనాథపురవరము గలిగియుండ ఋషులు, మునులు, జనులు ముక్తికొఱకు శ్రమణ ధ్యాన మన నాసక్తులం దగిలి యేల బహువిధదుఃఖంబులఁ బొల్వడు చుండి రని మామనంబుల సందియములు మము వేధించు చున్నయవి. కరుణించి మాసందియంబులఁ బాపవే" యని ప్రార్థింప "మునివరులారా! మీవంటి సర్వతత్త్వస్వరూపు లిట్టి విషయముల సంశయాస్పదు లగుట కడు శోచనీయము. ఎవనికి దేనియందు నభిరుచి కలుగునో యెవనికి నేకార్య ములయందు భక్తిశ్రద్ధ లలవడునో వారలు తత్కార్యపర

తంత్రమున శ్రమ చెంది నైనను నధికోత్సాహులై ప్రవర్తించెదరు. ఒకఫలమును బొందుట కనేకమార్గములు సూచింపఁబడి యుండెను. అందు వారివారి యిచ్ఛానుసారమున నాయామార్గముల ననువర్తించెదరు. విధి కామ్యము అని, కర్మము అని రెండువిధములు.అందు వర్ణాశ్రమములననుసరించు కర్మము విధియనియు, నిత్యనైమిత్తికంబులఁ బరఁగునది కామ్యమనియు నెగడుచుండును. లతలు లతాంతములు నన్నియు సమములయ్యును సుమార్థి తనకు హితమగుదాని పుష్పమునే గొనఁజూచును గాని పుష్పసంతతి కంతకును వాంఛ నిడఁడుగదా. అట్టులనె మనుజుఁడు ముక్తినలవరచు తెరువులు పెక్కులు గలిగి యుండినను దనకు హితమగు మార్గమునే చనఁ జూచును గాని పలుదారుల నెన్నఁడును జనఁ జూడఁడు. సమానవర్ణములు గల గోక్షీరములు సమానపాత్రముల నునిచి నపుడు మనుజుఁ డొక్కటొక్కటియె యానఁ గలఁడు గాని యన్నియు నొకసారి యానఁగలఁడా! అటులనె సమానములగు నిర్వాణహేతువు లనేకములు గలవు. అందు మోక్షేచ్ఛ గలవారు సుసాధ్య మగు నొక హేతువును గొని తృప్తి నొంది దానినే నిత్యమును నియమపరత సేవించు చుందురు.

కాశీమాహాత్మ్యబోధకము లగు కథలను వినిన మనుజులన్యము లెవ్వియు నభిలషింపరు. బ్రహ్మనిష్ఠాగరిష్ఠు లగు మీరలు సంశయింపనేల? ఇందుల కొక యితిహాసము గలదు. వినిపించెద వినుఁడు. దాన మీసందియములు విచ్చిపోవును. కాశిఁ బోలు దివ్యతరపుణ్యక్షేత్రము భూమియందు వేఱొండు గలదా!.

## వసిష్ఠవామదేవసంవాదము.

సరస్వతీనదీతీరమున సత్యగుణసంపన్నంబై ఫలపుష్పసంభృతతరులతాబృందసమృద్ధంబై యతివిచిత్రత గన్పట్టు నొక యాశ్రమరాజంబు గలదు. అయ్యది వసిష్ఠతపఃప్రభావసంజనితసామర్థ్యవిశేషంబువలనఁ గడు రమణీయంబై చూపరుల కమితానందదాయకమై తక్కుంగల యాశ్రమంబుల కన్న మిన్నయై వన్నె కెక్కి యుండె. అందు వసిష్ఠముని వెయ్యాఱులు శిష్యులుసేవింప నియమపరతఁ దపంబు సలుపుచుండును. అచ్చటి కొకానొక సమయమున వామదేవుఁడు స్వభావసిద్ధముగఁ జనుదేర వసిష్ఠుఁ డెదు రేగి సభక్తికముగఁ బూజలొనర్చి యాసన మిడి కుశల మడిగి ఫలమూలాదుల నారగింపఁ జేసి పథశ్రాంతు లుడిపి యిరువురును సమాధినిష్ఠల నెగడుచు వేదాంతగోష్ఠి సలుపుచు వెలయుచుండిరి. అంత వసిష్ఠుఁడు వేదాశ్రయమై ప్రాశస్త్యమున నెగడుదాని ధర్మమోక్షోపయోగమై సూక్ష్మంబున నొప్పుదాని నిహపరసాధనాధారమై వఱలుదాని ముక్తినొసంగుదాని నెఱుఁగఁ దలఁచి వామదేవునిఁ జీరి "మహాత్మా! మోక్షసాధనములలో బ్రహ్మజ్ఞానైకసాధనము వినా సాధనసంపత్తి గలిగినదాని నెఱిఁగింపవే" యని వినయభయసంభ్రమంబులఁ బ్రార్థింప వామదేవుఁడు వసిష్ఠుని సాదరమున విలోకించి "ఆర్యా! దీపము లేక ప్రభ గలుగని విధమున వారిదహీనత వృష్టి గలుగని తెఱఁగున వేదోక్తసాధనము వినా బ్రహ్మపరతత్త్వ మెఱుఁగుజ్ఞాన మెట్లు గలుగును? అయినను లోకవిరాజమానమాననీయమై యాదిమధ్యాన్తరహితమై విశ్వనాథవేష్టి

తమై కాశికాక్షేత్ర మను క్షేత్రరాజం బొండు గలదు. అచట నివసించు జంతువులు భోగమోక్షప్రదుం డగు భోగిభూషణుని కటాక్షవీక్షణవిశేషమువలనను దక్షేత్రమాహాత్మ్యమువలనను మహాపాతకోపపాతకములం దొలంగి స్వల్పపరిశ్రమమున ముక్తి వడయుదురు. అందుం గల సురదీర్ఘికయందు స్నాన మాడిన మారుతఘాతమున ప్రాంకులు గూలెడు విధంబున సమస్తపాపములు డుల్లి పోవును. అందు స్వధర్మమును దప్పక యాచారవిరుద్ధముల ననుసరింపక విశ్వేశ్వరపదారవింద ధ్యానానందలోలమనస్కులగుచు మను మనుజులకు ముక్తి చేకురుట కబ్బుర మేమి? లోకములం గల సమస్తతీర్థములును హరిహరహిరణ్యగర్భాది త్రిదశులును మునిగణములును గాశియందు నివసించుచుందురు. అయ్యది శివుని యానందవనము. శంకరుని యవిముక్తక్షేత్రము. కాశియందు నివసించు మనుజులు చతుర్భుజ చతురానన చంద్రశేఖర తుల్యులు. అందలి జంతుసంతతికిని నిక్కముగ మోక్షము లభించును. కావున నందునటమటలు విడచి నివసించుట శ్రేయస్కరము. వారాణసీవాసము పలుకష్టముల కావాసము. అందు సలుపు హవనదానజపతపంబుల కెట్లనంతపుణ్యఫలము లభించునో యట్లుగనె పాపకార్యములు సలుప ననంతపాపఫలము లభించును. అందు వసియించుటకు వెరపుగలిగిన మనుజులు స్వధర్మపరుని దగిన బ్రాహ్మణుని వర్షాశనముల నొసంగి కాంపుర మునిచిన ననంతఫలమును బడయుదురు. అట్టి దాతలు గంగయందు నెన్ని సైకతరేణువులు గలవో యన్ని వర్ష సహస్రములు స్వర్గపురమున దేవనాథుని

చెంత సకలసంపత్సమృద్ధుల నొప్పుచు సుఖంబున వఱలు చుందురు. పిమ్మట నిర్మల మగు మహారాజకులమున జనించి భూపరిపాలన మొనర్చి దీర్ఘాయురుపేతు లై బహుపుత్ర పౌత్రులు పరివేష్టింప శంకరునికరుణాకటాక్ష వీక్షణమునఁ గాశియందు దేహత్యాగ మొనర్చి తారకోపదేశమున బ్రహ్మ జ్ఞాన మలవఱచుకొని పరమపదమును బొందుదురు. అశ్వత్థ పిచుమందసహకారాది వృక్షరాజములను వారాణసీపురమున నాటిన శాశ్వతయశము పరమును లభించును. కాశియందు సభక్తికముగ నీశ్వరలింగము ప్రతిష్ఠ చేసిన మనుజుఁడు నిష్కల్మషుఁడై మునిసన్నుతుఁ డగు విశ్వేశ్వరుని శరీర మునఁ బ్రవేశ మొనర్చును. అందు విశ్వేశ్వరార్పణ మని భక్తియుక్తముగ శాకము నైనను బ్రాహ్మణుల కొసంగు స్వధర్మ పరులను శాశ్వతపద మొసంగి శంకరుఁడు రక్షించును. ముల్లోకవిఖ్యాతతీర్థసంతతులచే రాజిల్లుచు జంతుజాలముల యఘసంచయములను నిర్మూల మొనర్చుచు దేవదేవు పార్వతీ మనోహరుని వాసస్థానమై మోక్షప్రాప్తికి నిదానమై మునిగణ సుశ్లోక మగు వారణావతమును దర్శింప నొల్లని మనుజులు గలరా! అందలి సద్బ్రాహ్మణునకు న్యాయార్జిత మగు ధన మల్ప మైనను నొసంగిన నయ్యది యనంతఫలదమై యొప్పా రును. విశ్వేశ్వరనివాస భాసురమగు కాశికాపురీమాహాత్మ్య మును వర్ణింప నేరి తరము. సూక్ష్మదర్శములలో సూక్ష్మమును సనాతనధర్మములలో సనాతనమును నుత్తమజ్ఞానములలో నుత్తమమును నగు రహస్యార్థమును దొల్లి శంకరుఁడు పార్వ

తికి నెఱింగించిన విధమును వినిపించెద. దాని వినిన పిదపఁ గాశీమాహాత్మ్యము దనంతనె నెఱుంగ నగు.

ఒకప్పుడు మేరుశృంగమునందు ప్రమథగణ సేవితుఁడై సుఖాసనంబున విరాజమానుఁ డగు మహేశ్వరుని బార్వతి విలోకించి "దేవాధిదేవా! మహాదేవా! నీవు ఆర్తత్రాణపరాయణుఁడవు, ఆశ్రితవత్సలుఁడవు, భక్తజనసులభుఁడవు. సాంఖ్యయోగ కర్మయోగ జప తపోధ్యానాద్యవలంబనులగువారలకును దక్షుఁగల వైదికకర్మముల సేవించువారలకును భగవంతునిదర్శన మలవడు ననియు, దాన సద్గతి చేకూరుననియుఁ జెప్పఁబడియున్నది. అయ్యవి ప్రయత్నపూర్వకములు,ప్రయాస పూరితములు,కష్టసాధ్యములు.కలియుగంబునమానవులు దుర్బలులు,ఈర్ష్యాపరాయణులు,కర్మవిరాగులు, ధనలోభులు, ఐహికసుఖపరతంత్రులును, బ్రయాసములకు నోర్వఁ జాలనివారును నయ్యెదరు. వారల సుగతికి గతి యెద్ది? వారి హితార్థము బ్రహ్మాదిదేవతానిషేవిత మగు జ్ఞానరహస్యమును గరుణించి వివరింపవే" యని సవినయంబునఁ బ్రార్థించెను. పార్వతి ప్రార్థనలక్షు నలరి శంకరుఁడు "మహాదేవీ! అనభిజ్ఞులవలన వెల్లడి యగును. గాన నట్టి రహస్యజ్ఞానమును వివరింపవలను పడదు. అయినను మహర్షిప్రోక్తమును సమస్తదేహధారులను భవసాగరతారణ మొనర్చి సుగతి నొసంగు మత్పురవరంబు వారాణసి గుహ్యాతమమై మహాశ్మశానమును అవిముక్తక్షేత్రమును నై పఱలుచున్నయది. అయ్యది తీర్థములలో నుత్తమతీర్థమును స్థానములలోనుత్తమస్థానమును జ్ఞానములో నుత్తమ జ్ఞానమును నైనకతన నెన్నఁడును నాచే విడువఁబడని యవి

ముక్తక్షేత్రము. స్వర్గమర్త్యపాతాళములయందలి సమస్త పుణ్యతీర్థములును మహాశ్మశానమందు నెలకొనియున్నయవి. అయ్యది నాకుఁ బ్రియమును గూర్చు నానందవనము. జన్మాంతర సహస్రముల నైనను క్షయ మందని పూర్వసంచితపాపపుంజము లవిముక్తక్షేత్రమునఁ బ్రవేశించు మాత్రమున నశించును. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు వర్ణసంకరులు స్త్రీలు మ్లేచ్ఛులు పాపయోనిజులు పశు పక్షి మృగాదులు కీటకములు మొదలగునవి కాలానుగుణముగ నవిముక్తమందు దేహత్యాగ మొనర్చిన శివలోకమునఁ జంద్రశేఖరులు త్రిణయనధారులు వృషభవాహనారూఢులు నై విరాజిల్లు. అవిముక్తమందు శరీరత్యాగ మొనర్చిన యెట్టిపాపాత్ముఁ డైనను నీశ్వరానుగ్రహమున యమాలయమును జూడక యే పరమపదము నొందును. అవిముక్తక్షేత్రమున శరీరత్యాగ మొనర్చిన లభించుగతి హవనదానతపోయజ్ఞాదులవలన లభింపనేరదని మునిపుంగవులు వేనోళ్లఁ గొనియాడుచుందురు. అందు నీశ్వరభక్తులు నియమశీలురు వ్రతతత్పరులు వాస మొనర్చుచుందురు. అందుసలుపు హవనదానతపోజపాదులు స్వల్పము లైనను నక్షయములై యనంతఫలదాయకము లగును. ఈ రహస్య మెఱింగినవారలు మోక్షము సులభ మనియు సంసార సాగర మతిభయంకర మనియుఁ దలంచి కాశీవాసముసలుపుచు మృత్యుముఖమును గనఁ గోరుచుందురు. మహాపాతకోపపాతక పూరితమై పీడింపఁబడు శరీరధారులకు నవిముక్తక్షేత్రము పరమౌషధ మని మహాత్ములు నొక్కి వక్కాణింతురు. వేయేల? అవిముక్తమే పరమజ్ఞానము. అవిముక్తమే పరమ

పదము. అవిముక్తమే పరమతత్త్వము. అవిముక్తమే పరమశివుఁడు. ప్రయాగము నైమిశారణ్యము శ్రీశైలము హిమాలయము కేదారము భద్రకర్ణము గయాక్షేత్రము పుష్కరక్షేత్రము కురుక్షేత్రము వంశతీర్థము ప్రభాసతీర్థము శంకుకర్ణతీర్థము హాటకేశ్వరము సాలగ్రామము విజయేశ్వరము గోకర్ణము నను క్షేత్రములు ముల్లోకములయందును బుణ్యప్రదము లని ప్రసిద్ధి గాంచినవి. అయినను వారాణసీపురమందుఁ ద్రిపథగామిని భగవతి గంగాభవాని సంపర్కమువలనను నీశ్వరుని తారకబ్రహ్మమువలనను మరణము నొందువారలకు లభించు సుగతి మఱే యొందును లభింపనేరదు. పాపులు శఠులు నధర్మరతులు మొదలగువారే రైనను వారాణసీపురప్రవేశమాత్రమునఁ బవిత్రు లగుదురు. అన్యత్ర యోగధ్యానసన్యాసాదిసాధన సంపత్తివలన సహస్రజన్మముల నైన నలవడఁ జాలని పరమపదము వారాణసీపురమందు భక్తియుక్తముగ శంకరుని సేవించుచు ధర్మతత్పరులై వాసము సేయు మనుజుల కొక జన్మమునం దలవడును. ఈ పరమోత్తమజ్ఞాన మెఱుంగఁ జాలక మూఢమానవులు తమోగుణపరివృతులై మలమూత్రభూయిష్ఠ మగు మాతృగర్భమును బలుమారు ప్రవేశించుచున్నారు. దేవతలలో నారాయణుని భాతి నీశ్వరులలో గిరిశుని బోలె స్థానములలో నవిముక్తక్షేత్ర ముత్తమమై వెలయుచున్నది.” అని పార్వతికి దేవదేవుఁడు వినిపించిన యవిముక్తక్షేత్రమాహాత్మ్యమును వామదేవుఁడు వసిష్ఠునకు వివరించి వినిపించెను. వసిష్ఠుఁడు వామదేవు ముఖకమలమునుండి వెలువడినవారాణసీమాహాత్మ్య

కథనామృతమును పానం బొనర్చి ముద మంది మునివర్యా! యీశ్వరుని నివాసస్థానమును ముక్తిదాయకమును నగు కాశికాపురమును వీడి చెట్టఁగల చోట్ల నిలచు టెట్టిది మన కేల? సత్వరము కాశి గనుఁగొన నరుగుద మని పలుక వామదేవుఁడు వల్లె యని బదు లొసంగెను. ఇట్లు వసిష్ఠవామదేవు లిరువురును గృతనిశ్చయులై స్వాశ్రమమును శక్తికొమరున కొప్పించి స్వస్థచిత్తమున నవిముక్తమును దర్శింప బయలు వెడలి వీతరాగులై శ్రద్ధాభక్త్యుత్సాహంబుల మహారణ్యంబునఁ బోవుచుండిరి. యుద్ధరంగమున సుపర్వుల గర్వ మణంపఁజాలు బలదర్పముల కాలవాల మగు సేనానిచయుఁడై హుండకుఁ డను రాక్షసవీరుఁడు సబంధు పుత్త్ర మిత్త్ర పరివారముగ నమ్మహారణ్యమున విచ్చలవిడి సంచరించుచు మార్గమధ్యమున నమ్మునిద్వితయమును బొడఁగాంచెను వసిష్ఠవామదేవు లిరువురును ఆనిశాచరుల నీక్షించి వీరలు శూరులు సురమర్దన సుస్థిరులు, సాధుజనబాధకులు, అధర్మమార్గప్రవర్తనులు, అని దలంచుచు దూరదూరమున నొదుగుచుఁ బోవుచుండ హుండకుఁడు వారిచెంతఁ జేరి మీర లెవరని యడిగెను. వసిష్ఠవామదేవుల మని యమ్మునిద్వయము బదు లొసంగ వారలఁ దేఱిపాఱఁ జూచి నేను భయదసమరగోత్రజిద్భయంకరుఁడ, మాలి పౌత్త్రుని పుత్త్రుఁడ హుండకాఖ్యుఁడ నని తన కులబలప్రతాపములఁ బేర్కొనెను. రక్కసులును సంయములును నన్యోన్యము గుర్తెఱింగి భీరువులై కర్తవ్య మెటు దోఁపక కొంతవడి ఱిచ్చవడి నిలిచిరి. మునిపుంగవుల నామములఁ దెలిసి హుండకుఁడు మది నించుక యోజన మొనర్చి

తన సహచరులం జూచి మునిద్వయము వెఱగుపడ భీషణ భాషణముల "మాపంశజులును త్రిదశులును సంగ్రామరంగమునఁ దీవ్రబాణానలజ్వాలల నొండొరుల నలయించుకొను సమయమునఁ బరాశరుఁడు భీకరయాగమొం డొనర్చి దహనజాతతప్తాగ్నిజ్వాలల దానవకాననము దహింపఁజేసె" మఱియు వసిష్ఠుని దిక్కు మొగంబై "యీర్ష్యచే దుర్మదుఁడై మద్గురువరుని తపోవహ్నిని దహింపఁజేసిన దురాత్ముని పితామహుఁడితఁడు. ఇతని పౌత్రుఁ డొకఁడు రాక్షసనాశక మగు యాగమొండు గల్పించి తన్మూలమున నొక్కమ్మడిఁ బ్రేతపురము నకు మత్పితరులఁ జేర్చె. మత్పితరుల దమియించిన కఠినాత్ముని వంశమునకు మూలపురుషుఁడు. వీని సమిత్రకముగ నీడ్వఁడఁ జేసెద. భస్మీభూతుఁడఁ గావించెద. నాయభీష్టము చిరకాలమున కొనగూడె. వీరల సేవలనికిఁ బోనీక పట్టుఁడు. కట్టుఁడు కొట్టుఁడు" అని పలుక తాక్షణమున సహచరులు వారల నరికట్టిరి. మునివరు లొకరి మొగ మొకరు చూచుకొనుచు "వీరిని శక్త్రాదు లైనను విడువుఁ డని పలుక సాహసింపఁజాలరు. మన మేమి చేయఁగల మని దైన్యంబు వీడి ధైర్య మలవఱచుకొని నిర్వికారులై ముదంబున నింద్రజిన్ముక్త నాగాస్త్రబద్ధవిరాజమాను లగు రాఘవుల వడువున రాక్షస పాశబద్ధులై రాజిలుచుండిరి. వాఁండకుఁడు ఖడ్గమును జేఁబూని వారిఁ దునుమఁ గృతనిశ్చయుఁడై యుండుటఁ గని వామదేవుఁడు వసిష్ఠునిఁ జీరి యమితానందమున నవిముక్తము గన నేగుచుండు తఱి నకారణముగ మన కిట నెట్టి ప్రతిబంధకము సమకూడెనో గనుఁగొనుము. నేఁ డిది శ్రేయమే గద.

"శ్రేయాంసి బహువిఘ్నాని" అను నుడువును విన లేదా? శ్రేయస్కరము లగు కార్యములకు దివ్యులు కూడ విఘ్నము లొసఁగు చుండుదురు. దనుజుఁడు చంపు నని మనంబున నించు కయు దుఃఖింపను. తను వేరికిని శాశ్వతము గాఁజాలదు. భవుని పురమును గనుఁగొనఁజాలని భాగ్యహీనతను గూర్చి విలపించుచుంటి. పార్వతీధవుని పదపంకజములను సుస్థిర చిత్తంబున సేవించువారలకు నాపదలు దరిఁ జేర నేరవు" అని పలుక వసిష్ఠుఁ డట్లు స్థిరచిత్తుఁ డయ్యెను. వసిష్ఠవామదేవు లిరువురును శైలజామనోహరు నానందవనవిహారు పదవనజము లాశ్రయము లని నమ్మి దమతమ హృత్పుటంబుల భద్రపఱచి నిమీలితనయనులై తదేకధ్యానాయత్తచిత్తులై యుండ హుండ కుఁడు హుంకరింపుచు వాలు కేలఁ బూని వారి శిరములు ఛేదంబులు గావింప దుముకు సమయమున భక్తజనవత్స లుఁడు ఆర్తత్రాణపరాయణుఁడు గిరిజామనోహరుఁ డమ్మునీంద్రుని యెదుట నావిర్భవించి క్రోధోద్ధూతరూక్షవీక్షణ కాలానల జ్వాలల సాధువిరోధి యగు హుండకుని బంధుమిత్ర సహ చరసమేతముగఁ గాల్చి చంపి సంయమివరులకట్లు ద్రెంపి యంతర్హితుఁ డయ్యెను. మునివర్యులు గనుదమ్ములు విచ్చి చూచునంత పీడిన కట్లను భస్మపురాసులను చెంతలఁ గని శంకరు కరుణాకటాక్షవీక్షణమున మానవాశనులు మడసిన వారిఁగాఁ దలంచి విశ్వనాథు చరితములు విస్మయము లని మది నెన్నుచుఁ "గాశి కేగఁ దలఁచిన మాత్రమున హరుఁడు ఆపదల హరియించె నిఁక నచట నిలిచిన వానివారలె యను టకు సందియ మెద్ది?" యని సంతసించుచుఁ బ్రయాణోత్సు

కులై భవుని పదములు భక్తి సేవించుచు భీకరకాననపథం బుల సాగిసాగి చిరకాలమునకు విస్మితాంతరంగులై కట్టెదురఁ గాశీపురవరంబును దత్పురిముఖంబున నొప్పుజహ్నుపుత్రికా రత్నమును గాంచి ముకుళితకరకమలులై చని చని సువర్ణ హర్మ్యసౌధ గోపుర దేవాలయమంటపావళులచేఁ, బారిజాత మందార మాకంద మాలూర చంపక ప్రముఖ భూరుహాతండం బుల నొప్పు శృంగారవనవాటికలచే, గంగాతరంగములు కాశికాపురంబును గౌఁగిలించువడువున వృక్షశాఖలముదం బున నాలింగన మొనర్చి నల్లిబిల్లిగ నల్లుకొను లతావితాన ముచే, సూర్యచంద్రకాంతిపుంజతిరస్కారణచణ మణిగణనిర్మిత విశ్వనాథసభామందిరముచే, బిల్వదళముల హస్తంబుల నొప్పుచు శంభుపూజనతత్పరతాత్పరగతు లగు భక్తవరు లచే, వేదవిదితకర్మకాండవిధాననిశ్చయపరతంత్రు లగు ముని జనభూసురబృందంబులచే విరాజిల్లు పురవరంబును జొచ్చి సకలసంపత్సమృద్ధుల నలరి సుఖంబునఁ గాఁపురము సేయుచుఁ దైర్థికులు చనుదేర నెదు రేగి తోడ్తెచ్చి సత్కారపూర్వక ముగ నతిథిపూజ లొనర్చి మృష్టాన్నసముదయంబులఁ బరి తృప్తులం జేయు గృహమేధులం గనుంగొనుచు మధ్యాహ్న కాలమున మణికర్ణికాస్నాన మాచరించి దేవపితృదేవతలఁ దృప్తులంజేసి కాశీశుని దర్శన మొనర్చి పంచాక్షరీమంత్రపఠన తత్పరులై కతిపయదినంబులు నిమిషములుగఁ గడపిరి. ఇట్లు మునివరులు వ్యోమకేశుపురమున దృఢతరచిత్తులై తప మొనర్ప మెచ్చుకొనుచు మెప్పు లొసంగ విశ్వనాథుఁడు హైమవతితో వారల యెదుట సాక్షాత్కరించెను. అట్లు

ప్రసన్ను లగు సుమహామహేశుల వినయభయభక్తిసంభ్రమముల నిటలతటఘటిత కరపుటులై స్తోత్రపాఠంబుల సంతసింపఁ జేసిరి. వారి భక్తికి ముద మంది యద్దివ్యులు "మీకోరిక లెవ్వియొ దుర్లభము లైనను నొసంగెదఁ దెల్పుఁ" డని మందలింప మునులు "ప్రభూ! జీవితకాల మెడ సేయక కాశీవాస మొనగూర్చి దేవర పదపంకజముల భక్తి పాయకుండు నటుల వరము దయసేయుఁ డని ప్రార్థింప "మునులారా! మీకోరిక లొసంగితిమి. మీర లవిముక్తక్షేత్రమున నివసించుచు మిమ్ము దర్శించువారి పాపముల హరింపఁ జేయుచుఁ గాశీవాస మొనర్చుమనుజులకుఁ దద్విఘ్నకరము లగు విఘ్న పరంపరలఁ బాఱఁద్రోలుచు నుండుఁడు నిజధర్మముల వీడక నియతవ్రతులై మము భజించు మనుజులకు భద్రము లొనగూర్చుచుందుము." అని గిరిజాద్వితీయుఁడై శంకరుఁ డంతర్హితుఁ డయ్యె. వసిష్ఠవామదేవు లానందవార్ధి నోలలాడుచుఁ గాశికాధినాథుఁడు పలికిన పలుకుల నెద నిలుపుచు స్వధర్మపరులై పాపదూరులై శంభుపూజనతత్పరులై మోక్షకాంక్షులై వారాణసీపురవరంబునఁ గాఁపుర మొనర్చుచుండిరి. మునివరులారా! ముక్తిద మగు వసిష్ఠవామదేవసంవాద మను నీయాఖ్యానమును బ్రయత్నపూర్వకముగ వినినను బఠించినను సకలసంపత్సమృద్ధియు నిష్టకామ్యార్థసిద్ధియు నగును. నిరంతరావిఘ్న కాశీవాస మొనగూడును.

తపోధనులారా! స్వధర్మముల నెడఁబాయక కాశీవాస మొనర్చువారలకు నరచేతిలోని ఫలమువలె సునాయాసముగ నీశ్వరపద మొనగూడును. అవిముక్తపదమునఁ గలుష మొన

రించిన భైరవదూత లోసంగు తీవ్రయాతనల ననుభవింప వలయు. వార లొనర్చు దండనము లతిరౌద్రములు. శమన దండనములకన్న మిన్నలు శమనపురగమనము గర్భయాతనానుభవము కాశియందు మృతి నొందినవారలకుఁ గలుగదు. కాశియం దొనర్చిన దుష్కృత్య మెంత స్వల్ప మైనను దాని ఫల మమితము. అతిదారుణము. అయ్యది భైరవదండనానుభవమువలన క్షయ మగును. కాశియందు మృతి నందిన పాపభాక్కు లనుభవించు భైరవ దండనముఁ జూడఁ దరము గాదు. అని భృగుమహర్షి వచింప మునిపుంగవులు, "మహాత్మా! కాశీమాహాత్మ్యమును విని సంతస మందితిమి. తొల్లి కాశి యందు ఎవఁ డెట్టి కలుష మొనర్చి వాసి చెడి గాసిఁ జెందె. అయ్యది మా కెఱింగించి మము గృతార్థులఁ జేయుఁ"డని ప్రార్థింప, భృగుమహర్షి, "యిందుల కొక యితిహాసము గలదు. అయ్యది వినిన మీసంశయము లెడబాయు" నని యిట్లు చెప్పఁ దొరఁకొనెను.

## క్రమేలకచరితము

తొల్లి, ధర్మాత్ముఁడు, దేవబ్రాహ్మణభక్తితత్పరుఁడు, దయాళుఁడు క్రమేలకుఁ డను నొక శూద్రకులజుఁడు కాశీవాస మొనర్చుచుండెను. ఆతఁడు ధర్మవత్సలుఁడు. ధనవంతుఁడు. అతిథి అభ్యాగతుల సాదరంబున నాదరించువాఁడు. వాని వలెనె వానిభార్యయు, పుత్రులును ధర్మనిష్ఠాగరిష్ఠులు. యథోక్తతిథివారములయందు తదుక్తతీర్థసేవ లింగార్చనముల భక్తియుక్తముగ సలుపుచు చిరకాలము పుత్రమిత్ర కళత్రసేవితుఁడై, సత్పురుషుఁ డను ఖ్యాతిని బడసెను. అంత

కొంత కాల మరుగ నొకనాఁడు వేదవేత్త భాగురి యను విప్రవరుఁడు బుభుక్షాపీడితుఁడై యాతిథ్యకాంక్షచే క్రమేలకుని వేడఁ బోవ నాతఁడు తనజన్మాంతరకృతపాపసంచయము వలన తొల్లింటి ధర్మబుద్ధి వెడల నడచి బ్రాహ్మణుఁడని యైనను దలంపక ధనమదాంధుఁడై నిందింప మొదలిడెను. భాగురియు క్షుధాతురుఁడై యానిందల సరకుగొనక మృదుమధురవచనంబుల మఱిమఱి ప్రార్థింపఁ జొచ్చెను. అంత క్రమేలకుఁడు మోహావేశమున పదతాడన మొనర్చి వానిని బోఁద్రోచెను. క్షుద్బాధాపీడితుఁడును పాదతాడితుఁడును నగు భాగురి క్రమేలకగృహంబు వీడి తనయభాగ్యమునకు నిందించుకొనుచు మార్గంబునఁ జనుచుండ మధ్యేమార్గమున దైవనియతిని తులాధారుఁడను ద్రవ్యవంతుని దానశీలుని గని వేడఁబోవ ధనరాసుల నొసంగి యవ్విప్రుని ముదితహృదయునిగాఁ జేసెను. కిల్బిషాచారుఁడు క్రమేలకుఁడు కొన్నినాళ్లకు దుర్భరజ్వరార్తిపీడితుఁడై ప్రాణంబుల విడిచెను. ఆతఁ డొనర్చిన బ్రాహ్మణాపరాధమునకు విగ్రహులై పటుతరరోషభీషణులై భీకరాకారులై సునిశితాస్త్రశస్త్రధారులై భైరవదూత లొక్కుమ్మడి చుట్టుముట్టి నిష్ఠురోక్తుల దూషించుచు నాతని సూక్ష్మశరీరమును ఘనపాశముల బంధించి దోకొని భైరవుని యెదుట నునిచిరి. క్రమేలకుని నీక్షించి నంతన భైరవుఁడు భీకరాకారుఁడై దుర్మదుఁడై కన్నుగానక పుణ్యుల పరిభవించిన యీపాపాత్ముని నిత్యమును తత్ఫలమనుభవించునటుల క్రూరదండనల పాల్సేయుఁ డని కింకరుల కాజ్ఞ యొసఁగెను. భైరవుని యాజ్ఞ చెవిని బడినంతనె

క్రమేలకుఁడు మూషకమై జన్మించి శీతహ్రదంబున వర్షసహస్రములు పలుదుఃఖముల ననుభవించెను. పిమ్మట నిర్జలప్రదేశమున క్రిమియై జనన మంది క్షుత్పిపాసాశాంతి యొదవక భ్రమసి భ్రమసి యటుపిమ్మట సారమేయమై పుట్టి దుర్మాంసముల మెసవుచు మరగి మరగి పిమ్మట సంకీర్ణయోనుల నుదయమంది ముప్పదేసి వత్సరములు పలు ప్రయాసముల కోర్చి తుదకు శూద్రతనువు దాల్చెను అంత భైరవభటులు క్రమేలకుని దమ ప్రభువు సన్నిధి నునుప నాతఁడు దయాంతరంగుఁ డగుచు వీఁడు రుద్రపిశాచరూపమును ధరించి త్రింశత్సహస్రవర్షములు పలు బాములు కుడిచి తన కలుషమును క్షీణమొనర్చుకొనెను. ఇఁక శంకరుని తారకమున కర్హుఁ డని శంభుతత్వమును విధ్యుక్తముగ నుపదేశ మొనర్చెను. తారకమంత్రము క్రమేలకుని వీనుల సోకినంతనె నాతఁడు దుర్లభ మైన రూపమును ధరించి యమృతపదముఁ గాంచెను. మునివరులారా! ముక్తిప్రకాశి యగు కాశియందు మనుజులు చంచలమతు లయి శంకరపాదసరోరుహముల సభక్తికముగ సేవించుచు దినములు గడుపనేరక క్రూరకలుషముల పాల్బడి తత్ఫలము క్షీణించునటుల ఘోరదండనముల ననుభవించి విగతకలుషులై పరమపదముగాంతురు.” అని లోమశాదిమహర్షులకు వినిపించెను.

అంత లోమశాదిసంయములు భృగుని వీక్షించి ఋషిసత్తమా! విచిత్ర మగు నీక్రమేలకాఖ్యానము వినినంతనె విగతకలుషుల మైతిమి. మామనంబులు నిండారె. విరాగులై కాశియందు మృతి నంది ముక్తిపదము గనుట యరిది యని

దోఁచె. కాని సర్వతత్త్వవిశారదా! మామనంబుల నొక సంశయము వొడమి వేధించుచున్నయది. అది యెద్ది యన ముక్తిదాయిని యగువారాణసియందు విగతజీవు లగు యెట్టి పాపభాక్కులైనను మాతృస్తన్యపానమునకు దూరు లయ్యెద రని తొల్లి వినియుంటిమి. క్రమేలకాఖ్యాన బోధనాంతర మున నాతఁడు బహుయోనుల పా లయ్యె నని చెప్పితిరి. అయ్యది మాసంశయముల కాలవాలమై యొప్పుచున్నయది. కరుణించి మాసంశయములఁ బాఱద్రోలుఁ డని ప్రార్థింప భృగు మహర్షి సంశయవిచ్ఛేదియు లగుమునిసత్తములారా! ఇందుల కొక రహస్యము గలదు. దాని వినినంతన మీసంశయములు ఛేదము లగును. శ్రద్ధాళులై వినుఁడు. జ్ఞానాజ్ఞానవశమున మనుజుఁ డెట్టి కలుష మొనర్చినను యోనిజుఁడు గాక భైర వేచ్ఛామాత్రమున బహుజన్మముల ధరియించి యామ్యనరక ముల ననుభవించి పవిత్రుఁ డగును. స్థూలసూక్ష్మోత్కృష్టము లగుపాపములను సలిపిన తత్ఫలము రుద్రపైశాచరూపమును ధరియించి బహుక్లేశముల ననుభవించి క్షీణ మొనర్పవలయు. స్వధర్మనిరతుఁడై పాపముల ఫక్కికిఁ జనక శర్వుని సేవించు మనుజుఁడు దేహాంతమున సులభముగ నిర్వాణపదము గాన నగును. అట్టివానిని సుపర్వులు పరముఁ డని మన్నింతురు. స్వల్పపాపములు గంగాస్నానమునను విశ్వేశ్వరారాధనము వలనను దూరము లగును. అజ్ఞానవశమున నొనర్చిన పాప ములు పురహరుని పూజలవలనఁ దొలఁగిపోవును. జ్ఞానమున సలిపిన దోషములు సమయఁజాలవు. మహాపాతకోపపాతక ములు భైరవనిర్దిష్టక్రూరయాతనానుభవమున క్షీణ మయి

యంతమున పరమపదము గన నగును. యాత్రాపరులితరస్థలముల సంగత మగుకలుషసంచయము కాశీయాత్రవలనను కాశియందలిపాపములు పంచక్రోశయాత్రవలనను క్షీణ మొనర్చుకొని పవిత్రులగుదురు. కాశీవాసు లొనర్చు పాపములు దారుణభైరవదండనానుభవమువలనఁ గాని నశింపఁజాలవు. నిత్యయాత్రవలన సూక్ష్మపాపములు సమసిపోవును. ప్రాతఃకాలమున జాహ్నవియందును మధ్యాహ్నమున మణికర్ణికయందు నవగాహ మొనర్చిన కలుషములు హరించి జ్ఞానోదయమగును. అట్లు నియమపూర్వకముగ నొనర్చువారల నీశానుఁడు సదయహృదయుఁడై సంరక్షణ మొనర్చును. కాశియందు నివసించు మనుజులు ప్రత్యహమును విశ్వేశ్వరుని భవానిని దుండిరాజును దండపాణిని భైరవమాధవులను సేవించిన స్వల్పపాపములఁ బోకార్చెదరు. ఇవ్విధమున యాత్రానియతి గావించుచు స్వధర్మనియతిన కాశియందు నిలుచువారలు పావనులై సత్వరంబున నమృతపదము గనఁ గలుగుదురు.



# కాశీ మాహాత్మ్యము

## తృతీయాధ్యాయము



ఆహా! సురదీర్ఘికాంబుశీతలశీకరముల చేతను ధరాధర సుతేరితసత్పథంబుల చేతను స్వధర్మనిష్ఠాగరిష్ఠావధీరత దోషోచ్ఛయము చేతను పురవైరిపురము కడు రమణీయమై యొప్పుచున్నయది. అట్టి వారాణసీపురవరమాహాత్మ్యమును వీనుల విందుగా వినిచితిరి. ఇంకను మామనంబులు తనివిఁ జెందలేదు. తత్కథలనే వినఁ గోరుచున్నవి. అనఘా! మహాత్మా! ఇంకను విశేషించి యెఱిఁగింపవే యని లోమశాదులు భృగుమహర్షిం బ్రార్థింప నమ్మహర్షి మధువ్రతము లబ్జములట్లు లోకపావనులు విశ్వనాథపురము నాశ్రయింతురు. మీామనంబులు తనియునటుల వారాణసీపావనచరితమును వివరించు పుణ్యప్రదంబగు నొక కథ వినిపించెదను. స్థిరచిత్తులరై వినుఁడు.

### సుపర్వుని కథ

పూర్వకాలమున చతురంగబలసమేతుఁడు క్షత్రధర్మపరుఁడు సూర్యప్రతాపుఁడు సోమవంశభూషణుఁడు ద్వాదశాక్షౌహిణీనాథుఁడు భోగపురందరుఁడు నగు సుపర్వుఁ డను రాజవర్యుఁడు రాజ్యపాలన మొనర్చుచు నొకానొక దినంబున వేఁట తమకంబు మనంబున నుప్పతిల హయవరారూఢుఁడై

స్వల్పపరివారసహితముగ, సింహశరభశార్దూలఖడ్గమహిషకిటి మృగసముదయంబుల బలసియున్న కాననమునఁ జొచ్చి విచ్చలవిడి వానిం బరిమార్చుచు సంచరించుచుండెను. మృగయావిహారమున నొప్పు సుపర్వుని వారువము వేగవంతమై ఘనజవమున నన్యవనముఁ జొచ్చెను. భూపుఁడు తన యను చరులను గానక వారల యునికి నెఱుంగఁ గోరి నలుదిక్కులు పరికించుచుండఁ గట్టెదుర కనకగాత్రి కమలముఖి కైరవాక్షి కలకంఠకంఠి కరియాన కామోత్సుకి స్వకళత్రము వడు వున ప్రసన్నత నొప్పుదాని, సఖిజనపరివృతయై సరససరో వరంబుల వనకేళీ రతినొప్పుదాని, నొక కన్యకారత్నమును బొడగాంచెను. సుపర్వుఁడు చక్కఁదనమున కిక్క యగు నక్కన్యారత్నమును గనినంతనె మదన మంది మది విరాళిఁ జెంది దరిజేరి "కృశోదరి! శరదిందునిభాననా! సురనరకిన్నర నాగకన్యకలం బురుడింపం జాలు చక్కఁదనమున మిగిలి వన లక్ష్మివలెఁ బొడచూపు నీ వెవ్వరిదానవు? నే నష్టుఁడ నేని నీయుదంతమును నెఱిఁగింపు" మని మృదుమధురగంభీరవచ నంబుల పలుకరించెను. అంత నమ్మానవేంద్రుని వచనసుధార సంబుల కమ్మానిని యలరి వినయ భయసంభ్రమంబుల "రాజేంద్రా! నేను విశాలరాజుదుహితను. అనూఢను. మహా బాహూ! మీకు వరియింపఁ దగుదానను," అని ప్రత్యుత్తర మొసఁగెను. సుపర్వుఁ డక్కన్యారత్నము వచించు పలుకుల నాలకించి, "వరారోహా! రూపలావణ్యసంపదల మెప్పు గలిగి యొప్పుచున్న నిన్నుఁ గనినంతనె మోహభ్రాంతుఁడు గాని రాజవర్యుఁడు గలఁడా? నిన్ను నీజనకుఁడు వైవాహికమున

నొసంగ విధ్యుక్తముగ చేపట్టుట మాదృశులకు విహితకర్మము. అట్లుకాక వేఱొండు విధమునఁ బరిగ్రహించుట యమానుష కృత్యము. న్యాయవిరుద్ధము. నిందాస్పదము. నీగురుఁడు విధ్యుక్తముగ నిన్నొసంగినఁ జేపట్టుదు" నని పలికెను. అంత నక్కన్యారత్నము "ధర్మపరాయణుఁ డగు నాజనకుఁడు హాస్యాస్పదముగ ప్రతిజ్ఞాభంగ మొనరించి నాకు పరిణయ మొనర్ప సాహసింపఁడు." అను నుడువుల నాలించి భూపుఁడు సాదరంబున నవ్వన్నెలాడిం బలకించి, "రాజవర్యుఁడు పవిత్ర చరిత్రుఁడు బలపరాక్రమసంపన్నుఁడు విశాలుఁ డన్న సామాన్యుఁడా? అట్టివాని కెవ్వఁ డెట్టు విపద్దశ నొడఁగూర్చు? ఆ ప్రతిజ్ఞ యెట్టిదో యెఱింగింపుము. అర్హమగుదాని గర్హింప నేల! నేను దత్ప్రతిజ్ఞారక్షణమున బాసటనై నిలిచెదను. సందియ మేల నయ్యుదంతమును సాంతంబుగ నెఱుఁగఁ బలుకుము." అని పలికెను. అంత నప్పంకజాక్షి యపవర్గసాధనమును గిరిజామనోహరుని వాసస్థానము నగు వారాణాసియను పురవర మొండు గలదు. ముక్తినిదాన మగు నప్పురమున గిట్టుట దుర్లభము. కుండధరుఁ డను భూమండలేశుఁ డప్పుణ్యాపదమున కధినాథుఁడు ఆతఁడు ధనసమృద్ధియు సేనాసమృద్ధియుఁ గలవాఁడు. ఆతఁడు నన్ను తన్ను వరింపు మని కోర నాజనకుఁడు నీకొసంగిన నిన్ను పరిణయ మగుదు నని ప్రత్యుత్తర మొసఁగితిని. నాయందలి వలపు పెంపున నాతఁడు నాజనకుని కడకు భటులచేతను మంత్రులచేతను వర్తమానముల నంప మొదలిడెను. అట్లు కుండధరుఁడు పలుమారులు వార్తల నంపుచుండుట కెంతయుఁ గినిసి మద్గురుండుతుట్టతుదకునాకూఁతును

కాశిరాజున కిచ్చుట లేదని ప్రత్యుత్తర మొసంగెను. పిమ్మట కుండధరుఁడు ధూర్తత్వమున మాతంద్రికడకు తన పురోహితుని బనిచెను. మాతంద్రియు కాశిరాజు పోకడలకు మది చింతిలి తన తనయకు కుండధరుఁడు తగిన వరుఁడు గాఁడని పలికెను. అంత నమ్మనుజపతి పురోహితుఁడు తన విభుని పంపునఁ గొన్ని క్రూరవచనంబులు పలికి "చండశాసనుఁ డగు కుండధరుఁడు నీకు తప్పక జామాత యగు. మీదుహితను గోరి పలుమఱు ప్రార్థించుచున్నవాఁడు. ఉత్తమకులోత్పన్నుఁడు, బలపరాక్రమసంపన్నుఁడునగు కుండధరరాజేంద్రునకు హితంబున దుహిత నొసంగి మనుము. లేనిచో సబాంధవముగ యుద్ధరంగమున నింద్రాదులు బాసటనై నిలచినను నిను బొరిపుచ్చి నీకొమరితచంద్రికను రాక్షసవిధానమున పరిణయమాడఁగృత నిశ్చయుఁడై యున్నవాఁడు. పిమ్మట దేవర చిత్తము" అని పురోహితుఁ డూరకుండెను. అంత మజ్జనకుఁడు పురోహితునిఁ జూచి భయంకరాకారుఁడై రోషభీషణముల "దుర్మదుఁడవగు నీవు బ్రాహ్మణుఁడ వగుకతంబున నిట్టు ప్రల్లదంబులు పలికినను మనఁజాలితివి. ఇఁక వెడల నడువు" మని పలికెను. అంత పురోహితుఁడు "మహారాజా! నీవు దండితరిపుండవు, ఉద్దండుఁడవు. ఆతఁడు చండశాసనుఁడు, బలపరాక్రమసంపన్నుఁడు. మీయుభయుల విరోధమున ప్రజలు మృత్యువు వాతఁ బడుదురు. లోకహితంబు గోరి యుత్తర మొసఁగుము. నేను జనువాఁడ" నని పలికెను. అందులకు నాతండ్రి "భూదేవా! కుండధరాహ్వయుని దుర్మద మడఁగు నటుల యుద్ధరంగమున సబాంధవముగఁ దచ్ఛిరంబు ఖండించి యమా

లయమున కనిపి విద్యావినయ బలపరాక్రమసంపన్ను నృప కులాగ్రగణ్యు నొక్కని నాయనుంగుఁ గూఁతు చంద్రికకుఁ గూర్చి పరిణయ మొనర్తు. దైవవశమునఁ గుండధరుఁడు మడియఁ డేని చంద్రికకు వివాహము సేయఁజాల. అవివాహితగాఁ దిరుగుఁగాత. అనతికాలమున వారాణసి కరుదెంచి శిరంబు ద్రుంచి విశాలుఁడు చంద్రికకుఁ బరిణయ మొనర్ప నున్నవాఁడని మీరాజునకుఁ దెలియఁ బలుకుము. పలు పలుకు లేల? కరకంఠుని మహిమావిశేషమున గంగా సైకత స్థలముల దేవాసురు లడ్డ మైనను వెనుదీయక పొలికలన కుండధరనృపాధముని ద్రుంచుచువాఁడను. ఇఁక మీరాజు యూపగతపశువు తెఱంగున నున్నవాఁ డనుము.'' అని పురోహితుని బనిచెను. కుండధరవిశాలుర అన్యోన్యవైరంబులు పెచ్చుపెరుగ మచ్చరంబున భండనాయత్తచిత్తు లగుచుఁ బలు మారు విపులసంగ్రామములఁ బోరుచు నలబ్ధవిజయులై వ్యర్థ పౌరుషు లగుచుండిరి. ఉభయులును సమానబలులు; అతిరథులు. ఒకరి నొకరతిక్రమింపఁజాలక వితర్కించుచున్నవారలు. ఇక్కారణమున రాజశేఖరా! సమాన బలపరాక్రమకులశీలవయో గుణసంపన్నుఁ డగు నృపలలాముఁ డలవడినను బరిణయ మొనర్ప మజ్జనకుఁడు వెనుదీయుచున్నవాఁడు. ఇంతదనుక న న్నవివాహితగ నుంచుట కిదియ కారణము. ఇందు కూహక మెద్దియును లేదు. అని చంద్రిక తన వృత్తాంతమును విన్నవించెను. అంత సుపర్వుఁడు, "మానినీమణీ! దానపరిగ్రహమునఁ గాని నిన్ను బరిణయమాడనోప. విశాలధరావరు చెంతకు నీతోఁ జను దెంచెద. అమ్మహనీయుని దర్శనానంతరమునఁ గర్తవ్య

మెటులటులఁజేయుదు" నని చంద్రికాద్వితీయుఁడై విశాలుని చెంతకుఁ జనియెను. విశాలుఁడును యువతీజనమన్మథుండగు సుపర్వునీక్షించి సగౌరవమున నాతిథ్య మిడి యనురాగసూచకముగ కుశలం బడిగి, "నృపకులచంద్రమా! భూరిప్రతాపుఁడ వగు నిన్ను గనినంతన మాన్యుఁడ నైతి. నీయాగమనకారణ మెద్దియో యని నామనంబు తత్తర మందుచున్నయది. సాదరంబున నెఱిఁగింపవే" యని సవినయంబుగఁ బలికెను. సుపర్వుఁడు విశాలుని యాదరాతిశయమునకు సంతస మంది, "ఆర్యసుతా! పూతచరితయగు నీదుహితనుజంద్రికాఖ్యను విధిసమ్మతముగ నిజధర్మపత్నిగాఁ జేకొను కుతూహలంబున నిను బ్రార్థింప నిటఁ జనుదెంచితి" నని భక్తియుక్తముగ విన్నవించెను. ఆతని వినయభయభక్తులకు విశాలనృపతి యెంతయు ముద మంది, "సుపర్వా! లోకులవలన నీగుణగణంబులను బలపరాక్రమాతిశయంబులను బలుమఱు పలుతెఱంగుల వినియుంటిని. నీ వాంఛిత మొనగూర్ప నే ననురక్తుఁడను. నాకూఁతును నీకొసంగి పరిణయ మొనర్చు భాగ్యమ్ము కన్న వేఱొండు మిన్న గలదా! అయినను నిందులకు నేఁ బూనియున్న సమయ మొండు ముం దడుగిడ నీయకుండె. అయ్యది వినిపించెద వినుము. కాశికాపురాధిపతి కుండధరుఁ డనుకిల్బిషాత్ముని బుత్రమిత్రబంధుసహితముగ యుద్ధరంగమున గ్రిందుపఱచి కాశియందు మత్సుతను దగిన వరున కొసంగి పరిణయ మొనర్చెద నని తొల్లి ప్రతిన బూనియుంటిని. ఇఁక నీసహాయ మలవడిన వానిని సమయింప నెంత? కుండధరవధాంతమునఁ జంద్రిక నొసంగి పరిణయ మొనర్చెదను. నాప్రతిన కొన

సాగఁ జేయుము." అని పలికిన సుపర్వుఁడు "తొలుదొల్త చంద్రికోద్వాహ మొనర్పుము. పిమ్మట కుండధరుని రూపు మాపెద" ననిన, విశాలుఁడు "రాజేంద్రా! మునుముందు మత్ప్రతిజ్ఞ కొనసాగఁ జూచుట కర్తవ్యముగదా! మఱియుఁ బుణ్యరాశి యగు కాశియందు కన్యాదాన మొనర్చెదను. అచటికి రమ్ము" అని పలుక సుపర్వుఁడు "కాశిక మోక్షప్రకాశిక యనఁ గారణ మెద్ది? అచ్చటి విశేష మేమి గంటిరి? కాశియందు కన్యాదాన మొనర్చిన ఘనతయేమి? ఏతద్వృత్తాంతమును సకరుణంబుగ వివరింపుఁ"డనిన, విశాలుఁడు "వారణావత మనఘము. దాని మహిమ మతులము. అచింత్యము. అందు నిందారుభక్తి ధర్మ మణుమాత్ర మొనర్చినను, దానిఫల మనంతము. అందు మృతినందు మనుజులు ముఖజు లైనను యంత్యజు లైనను పండితు లైనను పామరు లైనను సంసారు లైనను సన్యాసు లైనను భేదములేక విశ్వనాథు తారకోపదేశమున నుగ్రపాపములు వీడి ముక్తిభాజను లగుదురు. స్వధర్మైకశీలుని విప్రవర్యు నొకని కాశియందు నిలిపి యన్న వస్త్ర మాదిగాఁ గల వరదానములఁ బరితృప్తుఁ జేసిన మనుజునకు కాశీవాసఫలము లభించును. అచ్చటి మణికర్ణికాస్నానము విశ్వేశ్వరార్చనము జన్మరాహిత్య మొసంగును. ఉత్తరప్రవాహమై పుణ్యప్రదమై శతకోటివిస్తార పుణ్యతీర్థ పరివృతమైయొప్పు గంగాజలము సమస్తపాపక్షయ మొనర్చును. అవ్యాకృతజలమయ మగు జాహ్నవి పుణ్యప్రభావమున భవ్యమగుకాశీక్షేత్రమున నివసించు మనుజులు దివ్య

లనఁబడుదురు. దివిజులు సమస్తకామ్యసమృద్ధికొఱకు విశ్వనాథుని నిరంతరము సేవించుచుందురు.

## శ్వేతకికథ

తొల్లి కాశియందు శ్వేతకి యను భూపాలుఁడు వేయి వత్సరములు శంకరుని గొలిచి పిమ్మట కైలాసపర్వతాభ్యంతరమున వర్షశత ముగ్రతపము సలుప హరుఁడు ప్రత్యక్షమై "రాజా! నీకోరిన కోరిక లొసంగెద. కోరు" మనిన "దేవా! నీవు యజ్ఞకర్తవు. యజ్ఞభోక్తవు. నేను జరుపఁబోవు సత్రయాగమునకు తగు ఋత్విజుఁడు సమకూడుట లేదు. కృపఁజేసి యాజకత్వ మూను" మని ప్రార్థింప శంకరుఁడు "నాసమానుని యవ్యయుని నొకని నీకొసంగెద" నని దూర్వాసుని రావించి రాజుం జూపి "యీతఁడు యాగార్థియై ఋత్విజునిఁ గోరుచున్నవాఁడు. ఈతఁడొనర్చు యజ్ఞమందు నార్త్విజ్యమును బూని మఱి రంజింపఁజేయుము" అని రాజువెంట దూర్వాసుని బనుప నాతఁడు రాజుజన్నమును సుపర్వులు మెచ్చునటులఁ బూర్తి యొనర్చెను. సుపర్వనృపశేఖరా! సిద్ధక్షేత్రము, తపఃక్షేత్రము, ముక్తిక్షేత్రము అని ప్రసిద్ధి గాంచిన కాశియందు మాచంద్రికకు వివాహముగావించెదను. ఇతరచోటులఁ దలంప నామన మొల్లదు. కృపజేసి దయసేయుము" అని విశాలుఁడు సుపర్వు నొడఁబఱచెను. కుండధరుని భండనమున నిర్జింపఁ గృతనిశ్చయుఁడై సుపర్వుఁడు దూతను బంచి తనసేనానివహంబుల రావించి ద్వాదశాక్షౌహిణీసేనాపరివృతుఁ డగుచు సత్వరంబునఁ గాశి కరిగెను. విశాలుఁడును, కుండధరుని వధించి సుమసమగాత్రి యగు తన

కూఁతును సుపర్వభూమీశునకు పరిణయ మొనర్తు నను కౌతుకమున ధరామరులఁ బెక్కుదానములఁ దృప్తిపఱచుచుఁ జతురంగబలసహితుఁడై చంద్రికతో సుపర్వునివెంట దండయాత్రకు వెడలెను. విశాలసుపర్వుల యాజ్ఞచొప్పున బలంబులు శత్రు లడలునటుల కాశీపురము నరికట్టిరి. శత్రుసేనలు పురంబు నరికట్టుటఁ జూచి కుందధరుఁడు రోషపూరితుఁ డగుచు బలంబుల సిద్ధపఱచి యుద్ధసన్నద్ధుఁడై బయలువెడలెను. ఉభయసైన్యములు దలపడి ఘోరంబుగ బోరఁజొచ్చె. కుందధరసుపర్వుల మహోన్నతరణవిశేషములఁ బరికించుతమకమున నిలింపులు గగనపథమున చుట్టుముట్టి నిలచిరి. అప్సరోగణములు కుసుమమాలికల కరంబులఁ గరంబు ధరించి యోధవరుల కాతిథ్య మొసఁగ ససంభ్రమముగ వేచి యుండిరి. అట్టి సమయమున పౌలోమీవల్లభుఁడు గురువరునిఁ జేరి, ''దేవా! సంగ్రామతలమున మృతు లగు యోధవరులు గంధర్వాంగనలఁగూడి సుఖంబు లనుభవించెదరు. కాశీపురంబున రణంబున మృతు లగు సుభటులు అంతియగాక మరి యెట్టి సుగతి జెందఁగలరో యూహించి వివరింపుఁ" డని యడిగెను. అంత, బృహస్పతి మఘువుని జూచి "కాశియందు మృతినొందువారలు అప్సరాంగన వొందు నేవగించి, భోగపరాఙ్ముఖులై నిరంతరము ముక్తికాంతాలింగనానురక్తు లయ్యెదరు. చంద్రశేఖరపురవరమున శస్త్రాస్త్రవితతుల మరణమొందువారలు నిర్వాణపదవి జెంది యీశుసాన్నిధ్యమున వరలుచుందురు. క్షేత్రసంతతుల నుత్తమోత్తమ మగు కాశీక్షేత్రమున మృతిని నభిలషించి మునివరులుకూడ వాస

మొనర్తురు. అందు మృత్యువును గను బ్రహ్మాదిపిపీలికపర్యం తము జంతుకోటికి మృత్యుంజయుఁడు సాదరమున తారకోపదేశ మొనర్చుచుండును. అన్యత్ర రణమున మరణము నందిన వీరవరులు స్వర్లోకసుఖము లచ్చరమచ్చెకంటుల కూటములు మెచ్చుదురు గాని అయ్యవి వారాణశిమృతవీరవరులు మెచ్చరు. అన్యదేశముల మృతు లగు మనుజులఁ గూర్చి యిట శ్రాద్ధ మొనర్చిన వారలు ముక్తిగతు లగుదురు. దేహత్యాగ మొనర్చిన ముక్తి గనుట యబ్బురమా! భవానీ సహితుఁడై యీశ్వరుఁడు నిరంతరము విహరించుచు ప్రాణి కోటికి సద్గతి నొసఁగుచుండును. ఈక్షేత్రమును బోలు క్షేత్రము వేరొండు లేదండ్రు ఇచట సంగ్రామమున శస్త్రాస్త్ర ఘాతములవలన మడియుజంతుసంతతి గూడ పరమపదము జెందును. మునివర్యులు యీయవిముక్తక్షేత్రమును భక్తి యుక్తముగ నియతవ్రతమున వదలక సేవించుచుందురు" అని కాశీమాహాత్మ్యమును వినుపింప గంధర్వాంగనలు "నాకేశా! మనము కాశికాపురము వీడి వృథా కాటేయ జెందనేల" యని చండికాభర్తను మనంబులనునిచి భండనము చూచుచుండుద మని తలంచుచుండ కుండధరసువర్వుల పోరు ఘోరమై ప్రాణహరమై మాంసశోణితకర్దమమై యొండొరుల చండకాండములు గండుమిగిలి శత్రుసేనలమడియించుచుండెను. రథంబులు రథంబులతో గజంబులు గజంబులతో నశ్వంబు లశ్వంబులతో పదాతులు పదాతులతో దలపడి క్షణమాత్ర మతిభయంకరముగ సంకులసమర మొనర్చిరి. ఇవ్విధంబున నిరుదెఱంగులవారును చతురతఁ బోరుచు హతసైన్యము

గావించుకొనుచుండిరి. అంత సుపర్వుఁడు, పుత్త్రమిత్త్రామాత్య బంధుసహితముగ కుండధరునిగూర్చి సర్వజనానురాగకులశీల గుణగణ సంపన్నవిశాలు విశాలుని పట్టభద్రుని గావించెను. పిమ్మట విశాలుఁడు సుపర్వునకు చంద్రిక నొసంగి యధిక వైభవమున పరిణయ మొనర్చి యల్లునకు కూఁతునకు మేలి భూషణములు కానుక లొసంగి ద్విజన్ముల దానపరంపరలఁ బరితృప్తి గావించి ధర్మంబు దప్పక కాశీపురమును పరిపాలన మొనర్చి సుఖంబున వసించెను. మునిపుంగవులారా! కాశీ మాహాత్మ్యమును చిత్తము లలరునటుల వినిపించితిని. ఈ యాఖ్యానమును భక్తిపురస్సరముగ వినినను బఠించినను సమస్తపాపక్షయమును, ధనధాన్యపుత్త్రపౌత్త్రసమృద్ధియు నగు ను. పాపహరము, సుగతిగతికము నగుకాశికాపురమాహా త్మ్యకథావిధానముల వినినవార లన్యకథావిశేషముల విన నొల్లరు. అని పలికి, భృగుమహర్షి సర్వతత్త్వవిశారదులారా! యింకను కాశీమహిమలను విస్తరించి తెల్పెదను ఆలింపుఁడు.

## యాజ్ఞవల్క్యజనకసంవాదము

తొల్లి జనకభూపాలుఁడు యాజ్ఞవల్క్యమునిపుంగవుని దిలకించి, "దేశికోత్తమా! మీరలు తత్త్వజ్ఞానసంపన్నులరు. అధ్యాత్మవిదులరు. షడ్గుణైశ్వర్యయుతులరు. సర్వార్థదర్శులరు. మీర లెఱుంగని రహస్య మెందును లేదు. సంసార మెట్టి వారికిని దుష్పారము, దుఃఖితము, దుర్గమము, దుర్వహము. అట్టి సంసారసాగరమున దగులుకొని దరిగానని మనుజులు సులభమార్గమున సుగతిఁ జెందు నుపాయ మెద్దియేని గలి గిన వివరింపుఁడు. వేదవిహితమై మునిజనమానితమై సమస్త

పాపక్షయకరమై సద్గతిసాధనమై నెగడు రహస్యార్థమును మీ ముఖంబున విని తరింపఁ దలంపుగొనియున్నాఁడను. కరుణింపుఁ" డని ప్రార్థనమొనర్చెను. జనకుని ప్రార్థనల నాలించి యాజ్ఞవల్క్యుఁడు ముదమంది "రాజేంద్రా! నీప్రశ్నము సర్వోత్తమము, అవ్యాజము, అతిదుర్లభము, సుగతిసాధన సులభము. అధికగౌరవమును, శుభప్రదమును, పరమపద దాయకమును, సమస్తజంతుసంతతికిని సులభమార్గమున నమృతపదము నొడఁగూర్చునదియును, నవిముక్తమును, విశ్వనాథపురవరమును నగు కాశీక్షేత్రము నిరుపమానమై దనరారుచున్నయది. దాని మహిమము వివరింప పురుషోత్తమునకైనను నలవిగాదు. అయినను నే నెఱింగినకొలఁది వివరించెద. ఏతత్క్షేత్రసేవనము వినా సులభోపేతముగ ముక్తికాంతను చేపట్టు సూక్ష్మమార్గము వేఱొండులేదు. పురహరుని పురవరమున దానజపతపోయజ్ఞాదిసాధనసంప్తివలనను, మరణమువలనను మోక్షప్రాప్తి కలుగును. అందలి జాహ్నవీ స్నానమువలన నంతశ్శుద్ధియు, నింద్రియనిగ్రహము కలుగును. దాన హరుఁడు హర్షమొంది సమస్తజంతువులకు నిర్వాణపదము నొసఁగుచుండును. అందు నీశ్వరుఁడు లింగాకారమున దివ్యమై విశ్వేశ్వరాభిధానమున విరాజిల్లుచుండు. విశ్వేశ్వరలింగసందర్శనము సమస్తపాపక్షయకరము. జ్ఞానదాయకము. వీతరాగము. క్రోధవివర్జితము. కోటిసూర్య చంద్రుల వడువున శతకోటితటిల్లతల తెఱఁగున వెలుఁగుచు త్రిలోకవ్యాపితమై, నిరంజనమై, నిరవద్యమై దనరారుచుండు. సూర్యచంద్రాగ్నులవలె గ్రహతారకలభాతి వెలుంగు

కాశికాపురము మోక్షదాయక మనియు, నిరంజన మనియు, నిరుపమాన మనియుఁ దలంచుచు మునివరులు కొనియాడు చుందురు. అందు బ్రహ్మనిష్ఠితములు, ప్రఖ్యాతములును, ప్రభావభూయిష్ఠములును నగు లింగములు సహస్రముల కొలఁదిగలవు. వాని దర్శనార్చనములవలన మనశ్శుద్ధి గలుగును.

## జ్ఞానవాపివృత్తాంతము.

విశ్వేశ్వరాలయమునకు దక్షిణపార్శ్వమున చిన్మయ స్వరూపి యగు జ్ఞానవాపి కలదు. అందలి జలమును స్నాన పానము లొనర్చినయెడ విజ్ఞానవృద్ధియు, బ్రహ్మైక్యసిద్ధియును గలుగును. దాన మానవులు యాగాదివిహితకర్మపరాఙ్ముఖు లైనను సులభముగ మోక్షమును గన గలుగుదురు.

అంత లోమశాదులు భృగువర్యుని దిలకించి, "మహాత్మా! జ్ఞానవాపివృత్తాంతము నాద్యంతమును నెఱుకపఱుపవే" యని ప్రార్థింప, నాతఁడు "మహర్షులారా! తొల్లి యీశ్వర పుత్రుఁ డగ స్కన్దునకు వినిపించిన చొప్పున జ్ఞానవాపి కథనము వివరించెద. వినుఁడు.

తొల్లి కాలభైరవుఁడు కాళీవినోదార్థము లోకసంత తులు తల్లడిల్ల, బ్రహ్మాండము చీకాకుపడ, భూధరంబులు డుల్లి పడ, పాథోధులు చదలంట నద్భుతముగ తాండవ మాడియాడి డస్సి దాహోపశమనార్థము జలములకొఱకు వెదుక మొద లిడెను. భర్గుఁడు లోకసప్తకమున జల మలవడకుండుట కాశ్చర్య మొంది ప్రళయమునందును భంగ మొందని కాశి కాపుర మరుదెంచి, తపస్విగా విశ్వేశ్వరుని నభిషేక మొనరింప

జలంబు గానక కాశీక్షేత్రోపకంఠభాగమున త్రిశూల మూది' భూచక్రమును భేద మొనరించి రసాతలమువఱకు గ్రుచ్చి వెలికిదీయ త్రిశూలము వెంబడిని పవిత్రజలము పాతాళము నుండి వెలువడియెను. భర్గుఁడు తజ్జలమున విశ్వేశ్వరుని శత రుద్రీయపంచసూక్తపారాయణ మొనర్చుచు నభిషేక మొన రింప, విశ్వనాథుఁడు సంతసమంది ప్రసన్నుఁడై యవ్విపర మునకు జ్ఞానవాపి, జ్ఞానోదము, జ్ఞానతీర్థము, శివతీర్థము నను నామంబులొసంగె. జ్ఞానవాపి దర్శనార్చనధ్యానసంకీర్తనము లును, తజ్జలస్నానపానాచమనములు సప్తసంతానఫల మలవరచి కైవల్యపద మొసంగును. బ్రహ్మరాక్షసపిశాచగ్రహవిముక్తి నొసంగును. బ్రహ్మజ్ఞాన మలవరచును. అని విశ్వనాథుఁడు వరము లొసఁగి యంతర్హితుఁడయ్యె. విశ్వేశ్వరుఁడు జ్ఞాన వాపిచెంత లింగరూపమున వాసమొనర్చుచుండెను. ఇట్టిమహి మావంత మగు జ్ఞానవాపిని సంయమివరులు మోక్షకాములై నిరంతరము భక్తియుక్తముగ సేవించుచుందురు. దీని మహిమ మెన్న నెవరితరము?'' అని వినిపించి మరల కాశీమాహాత్మ్య మును చెప్పఁదొడంగె.

ఇట్టి మహిమావంతము లగు కాశికాపురిని, సురదీర్ఘికను, విశ్వేశ్వరలింగమును, జ్ఞానవాపిని మునిముఖ్యులు భక్తిపుర స్సరముగ సేవించుచు యాగాదికర్మముల పరాఙ్ముఖులై యుం డిరి. అట్టి సమయమున పద్మజుఁడు మహర్షుల కర్మోచ్ఛేదమును దిలకించి శివప్రీత్యర్థము కాశీపురమున పదియశ్వమేధ యాగము లొనరించెను. బ్రహ్మ యొనర్చిన యాగములకు శంకరుఁడు ప్రీతుఁడై సాక్షాత్కరించి, 'వాంఛితము లొసఁ

గూర్ప సిద్ధముగ నుంటిని. వేఁడు' మని బ్రహ్మను బోచ్చ రించెను. అంత సృష్టికర్త 'దేవా! సమస్తజనులు నీపురమున వసియించుచు, నీయందలి భక్తిపెంపున కర్మవిముఖులై యొప్పుచుండిరి. అందువలన దివిజులు యజ్ఞభాగము లలవడమి క్షీణసత్వులై తొల్లింటివలె పుడమియందు వర్షింపఁజాల రైరి. వర్షాభావమున క్షామ మంకురించె. జనులు బుభుక్షపీడితులై సడలిరి. ప్రళయకాలము సమకూడె. లోకరక్షకుఁడ వయ్యుఁ బ్రజలకు రక్ష యొసంగకుంటివి. లోకసంతతులు యివ్విధమున క్షీణించుచుండ నీవుగాక పెరవారలు గావఁజాలరు. భూమి యందు కర్మములు సలుప భూతతృప్తి కలుగును. దాన దివిజులు సస్యానుకూలముగ వృష్టి నొసంగుచుందురు. అవిముక్తము నందలిభూసురులు వేదవేదాంతవిదులైనను కర్మవిముఖతఁజెంది జ్ఞానసాధనతత్పరులై ముక్తిఁ జెందుచుండిరి. వరదా! మేము నీయాజ్ఞల శిరమున ధరియించి మనువారము. గాన క్షామ మెవ్విధమునఁ బాయునో కృపజేసి దెలుపవే' యని పలువిధ ములఁ బ్రార్థించెను. అంత శూలిచతురాననుని పలుకుల నాలించి యించుక చింతిలి 'అవిముక్తకాశీక్షేత్రమున కర్మకాండము పరిహరించి, జ్ఞానకాండము పరిగ్రహించి పాపదూరులై మను వారలు ముక్తి భాజనులరు. అట్టివారికి నే నెవ్విధమున విప రీత మొనర్చువాఁడను? ఇంతవఱకు కాశీవాసులు నిరోగులై రాగద్వేషలోభకార్పణ్యాభయపిశునత్వాకలహాశోకమద మా త్సర్యాదివికారములఁ దెగద్రోచి నిరంతరము నన్నే స్మరియిం చుచు నియమితవ్రతులై యొప్పుచుండిరి. అట్టి నాప్రియభక్తుల నెట్లు మోహావికారుల చేయుదు? అయినను దేవతలకు కొంచె

ముపకృతి సలుపవలయు. తొల్లి మనయుభయుల వివాద సమయమున నీక్రోధభావమున మృత్యువు స్త్రీరూపమున ప్రకటము కాఁగా క్రోధభావమున జంతువులపాలిటి మిత్తియిది యని పలికి యుంటివిగదా! అంత నాస్త్రీ నీపలుకులకు వెఱఁగొంది కన్నీళ్లుగార మిక్కిలిగ విలపించెను. అపుడు నీ వామె కంటినీరు దోయిటఁ బట్టితివి. ఆజలమువలన రాగద్వేషములును, విఘ్నములు, రోగచయములును బయలువెడలెను. పద్మజా! యాకాంత అశ్రుజలవిభాగములు జీవుల సంహారింప ప్రధానసాధనములు. ఇచ్చట విఘ్నరూపమున మనుజులకు మానసవ్యధలు కలుగును. కొందఱు పతితులై స్వధర్మముల వీడి ధనలోభమున నెందేని బోయెదరు. ధర్మమును వీడక శ్రమల కోర్చి మత్పురమును నాశ్రయించి కాలము గడపువారలు తప్పక ముక్తిని జెందుదురు.' అని యీశ్వరుఁడు పద్మజునకుఁ బ్రజాసంరక్షణార్థ ముపాయము సూచించెను. అది మొదలు మునులహృదయంబుల రాగద్వేషములును, భయ విరోధప్రమాదములును, మదమాత్సర్యములును పదంబు లిడి పరుగిడసాగె. కొందఱు మోహపరవశు లైరి. కొందఱు యీర్ష్యాజనితహృదయు లైరి. మరికొందఱు భయభ్రాంత చిత్తు లైరి. ఇంకకొందఱు క్రోధభూయిష్ఠు లైరి. అంత మునివరులు, విశ్వనాథుఁ డేలకో మనల కకారణముగ విఘ్న సంతతి సమకూర్చెను. మన కెఱుకపడదు. అరిషడ్వర్గము మనల నావరించెను. తత్ప్రేరణమున నెద్దియేని కలుష మొనర్చిన నయ్యది సూక్ష్మ మైనను కోటిగుణితమై పరిఢవిల్లు. ఇఁక నిట నిలువరాదు. ఎందేని శీఘ్రంబున జని విధిపూర్వక

ముగ యాగాదికర్మము లొనరించిన చిత్తశుద్ధియును, తత్త్వజ్ఞానమును నలవడును. అని కృతనిశ్చయులై అవిముక్తక్షేత్రమును వీడి తీర్థేతరముల కరిగిరి. జనకభూపాలా! కాశీపురము ముక్తిసాధనసులభ మైనను విఘ్నసంతతికి వెఱచి, మునిముఖ్యులు దుష్ప్రాప్య మని విడిచి పరువిడఁ జొచ్చిరి. ఇఁక సంసారాంధనిమగ్ను లెవ్విధంబున కాశియందు నిలచి ముక్తి గనఁ గలుగుదురు.'' అని యాజ్ఞవల్క్యు జనకునకు కాశీమహిమమును వినిపించి ''పురాతనమును, పుణ్యాస్పదమును, ధర్మపథమును నగు కాశీవిశేషమును మున్ను భాస్కరునివలన వినిన మఱొండువిధమును వినుపించెద వినుము.

నేను సూర్యునిచెంత వేదాధ్యయన మొనర్చుతఱి నాతనిఁగన బ్రహ్మమానసపుత్రుఁడు నారదుఁడు విపంచీనాదమున మేళగించి గాన మొనర్చుచు జనుదెంచెను. అంతట భాస్కరుఁ డమ్మునిపుంగవుని విధ్యుక్తముగ పూజించి నమస్కరించి 'మహాత్మా! తాము దయచేసిన కార్య మెట్టిది? నే జేయ నగున దెద్ది? వివరింపుఁ' డని యడుగ, నారదుఁడు వికసితముఖకమలుఁడై 'కమలబాంధవా! మరుత్తను రాజవల్లభుఁడు గోమేధయాగ మొనర్చుతఱి వసిష్ఠాదిమహర్షులు శాస్త్రప్రసంగములుసలుపుచు తత్త్వవిచార మొనర్చుతఱి క్షేత్రసంతతులలో నిర్వాణపద మొసంగునది కాశి యని పలుతెఱంగుల ప్రశంస యొనరించిరి. అప్పట్టున శ్రీమన్నారాయణపదారవిందధ్యానానందరసామృతపానంబుకన్న విశ్వనాథపురివిశేష మేమి? పుష్కరాదితీర్థపుంజములును, కురుక్షేత్రాదిక్షేత్రసంతతులును మోక్షదాయకములు గాని వెట్లయ్యె?

నను సందియమ్ము నెమ్మనంబున నుమ్మలింపఁ జంచలహృదయుండ నైతి. నీవు లోకారాధ్యుఁడవు. లోకసాక్షివి. నీతేజఃపుంజములవలన జగంబుల వెలుఁగింపఁ జేయువాఁడవు. సర్వవ్యాపకుఁడవు. నీవెఱుంగని రహస్యంబులు గానరావు. నాసంశయవిచ్ఛేదన మొనరింప శక్తుండ వీవ యని దలంచి యరుదెంచితిని. కృపసేయవే' యని బహుభంగులఁ బ్రార్థింపఁ దొడంగె. అంత కమలాప్తుఁడు గానకళాకోవిదుఁ బలకించి, 'దేవమానీ! మీఁర లెఱుంగని ధర్మంబులు లేవు. అయినను నన్నడిగితిరి గావున వినుపించెదను. తపోధనంబున మిన్నలై వన్నె గాంచిన త్వాదృశులు సంశయాస్పదు లగుట యెంతయు శోచనీయము. సందిగ్ధహృదయులు జ్ఞాన మెవ్విధంబున నైన నలవరచుకొననేరక యుభయలోకములకు భ్రష్టు లగుదురు. విష్ణుభక్తియును, తీర్థేతరసంవాసమును నంతఃకరణశుద్ధి యొసంగును. అన్యక్షేత్రావలంబనము స్వాకృతధర్మకర్మజనితపుణ్యఫలము సత్పథసాహాయ్యసాధనము. కాశి యన్ననో కేవల విశ్వేశ్వరతారకోపదేశజనితజ్ఞానదీపము. బ్రహ్మైక్యప్రకాశితము. కాశీవాసమును విష్ణుభక్తియును నమృతపదమునకు సమానమార్గదర్శకము లయ్యును సంసారకాననవిహారణము నీషణత్రయమును భక్తిమార్గావలంబనమునకు పెక్కు లంతరాయము లొసంగుచుండును. ధనార్జనము ప్రియకర మగుకరణి భక్తియోగము కాఁజాలదు. అందువలన నిశ్చలభక్తి యలవడుట కడు దుర్లభము. మోక్షకాముల కయ్యది సులభమార్గము కాఁజాలదు. కాశి యన్ననో యీశ్వరనివాసభాసురము. మణికర్ణికావిరాజమానము. జహ్నుకన్యక విహారసుంద

రానందవనరాజము. ముక్తికాంతావాసప్రఖ్యాతము. దాని మహిమము లచింత్యములు, అనంతములు, అఘనాశకములు, అమృతపదదాయకములు. అందు నీచయోనిజు లైనను రాగ ద్వేషరహితులై విగతజీవు లయిన ముక్తికాంతాలింగనానంద భరితులగుదురు. రాగద్వేషులును, విస్తృతపాపులును భైరవ యాతనానుభవానంతరమున ముక్తిభాజను లగుదురు.' అని వివరించెను. ఇట్లు నారదుఁడు భాస్కరునివలన కాశి ముముక్షు సాధనసూక్ష్మ మని బోధింపఁబడి సంతసించుచు సత్యలోకమున కరిగెను.

జనకభూపాలా! మనుజు లొనర్చిన పాపములు కాశిని జేరిన నడఁగును. కాశియం దొనర్చిన కలుషములు భైరవుఁ డడంచును. కాశియన కైవల్యపదము. అందు పశుపక్షిమృగా దులకును ముక్తి సులభసాధ్యము. అని నారదునకు పద్మబాంధ వుఁడు వినిపించినవిధంబున కాశీమహిమమును వినుపించితి" నని యాజ్ఞవల్క్య పలికెను. అంత జనకుఁ డమ్మునిపలుకుల కలరి "మహాత్మా! మణికర్ణికాతీర్థము మహత్తరప్రభావపూరిత మనియు, త్రైలోక్యవిఖ్యాతమనియు, అమలఫలదాయక మనియు పలుమరు పలువురివలన పలుదెఱఁగుల వినియుంటిని. దాని ప్రాదుర్భావ మెట్టిదియో దాని మహిమావిశేష మెట్టి దియో యెఱుంగ చిరకాలకాంక్షితుఁడనై యుంటిని. నామ నోరథ మీడేరుకాలము నేటికి సంప్రాప్తమయ్యె. సాదరంబున నెఱింగింపవే" యని సవినయంబున ప్రార్థించెను. యాజ్ఞవల్క్య మహర్షి జనకునిప్రార్థనలకు ముద మంది "రాజా! మంచిప్రశ్న మొనరించితివి. చిత్తనిగ్రహుఁడవై భక్తియుక్తముగ మణి

కర్ణికా ప్రభావమును నాలింపుము. దాన శుభపరంపరావాప్తి
యొనగూడు.

## మణికర్ణికామాహాత్మ్యము

తొల్లి శ్రీమన్నారాయణుఁడు శంకరభగవానునిఁ గూర్చి వారాణసీపురంబునఁ దప మొనర్ప కృతనిశ్చయుఁడై సుదర్శనచక్రసాధనమున నొక రమణీయపుష్కరిణిని నిర్మించి దానికిఁ జక్రపుష్కరిణి యను నామ మొసంగి దానిని నిజాంగ నిర్గతస్వేదజలంబునఁ బూరిత మొనర్చి తత్తీరమున స్థాణు సమానాకారము వహించి యేఁబదివేల దివ్యవర్షములు దృఢ తరచిత్తుఁడై తపోనియతి నొప్పి యుండెను. అంత విష్ణుతపో వహ్నికి నుమాధవుఁడు ప్రజ్వలితుఁడై సతీసహితుఁడై తత్ప్రాంతమున కరుదెంచి నిశ్చలచిత్తుని నిమీలితనయనుని హరిని వీక్షించి 'ఆహా! తపము మహత్తరప్రభావపూరితము. మనోధైర్యసాధనము. సంసారకాననదావానలము. నరకార్ణవ తారణము. ఇంధనరహితముగ నిరంతరము వహ్ని ప్రజ్వలించు చున్నయది.' యని తనలోఁ దాను దలపోయుచు, హర్షసూ చకముగఁ బలుమరు మస్తకమునాడించుచు 'హరే! ఇఁక దపస్సు వలనఁ బ్రయోజన మెద్ది? కాంక్షిత మెఱిఁగింపుము. పూర్తి యొనరింప సిద్ధముగ నుంటి' నని పలికెను. శంకరుని సాదర వాక్కుల కలరి రమావల్లభుఁడు నేత్రకమలములు విచ్చి ప్రణతు లొనర్చి, 'దేవేశా! మహేశ్వరా! నాయందుఁ బ్రసన్న హృదయుల రైతి రేని నిరంతరము భవానీసహితముగ మీదివ్యసుందరవిగ్రహసందర్శన మొసంగుటయును, సమస్త స్థానములయందును సమస్తకర్మములయందును మీకంఠెమును

ముందు సంచరించుచుండు నటులను వరప్రదాన మొసఁగుఁడు. చంద్రశేఖరా! నాచిత్తభ్రమరము తావకీనపాదకమలమరంద పానాయత్తమై దృఢతరభక్తియుక్తముగ నుండునటులఁ గృప సేయుఁడు.' అని ప్రార్థించెను. అంత నీశ్వరుండు హృషీకేశుని సకరుణంబుగఁ దిలకించి 'జనార్దనా! నీకోరిక లొనగూర్చితి. సువ్రతా! నీకింకొక వర మొసంగెదను. దాని నాలింపుము. నేను నీతపస్సు నీక్షించి, తదానందాతిశయమున సర్పరూపకర్ణ భూషణయుక్తమగు నామస్తకమును నాడించితిని. ఆయాందో ళనకారణమున, నాకర్ణభూషణము మణికర్ణిక యీతీర్థమున జారిపడియెను. అక్కారణమున నీతీర్థమునకు మణికర్ణికాభి ధాన మొసంగితిని. చక్రధరా! పూర్వకాలమున నీతీర్థము నీచే సుదర్శనచక్రమువలన నిర్మిత మయిన కతనఁ జక్రపుష్క రిణి యను పేరం బరఁగుచుండె. నాకర్ణమునుండి రత్నకుండల మీతీర్థమందు జారిపడినసమయమునుండియు నియ్యది మణి కర్ణిక యనునామమున లోకవిఖ్యాత మగు' ననుపలుకుల నాలించి, హరి 'గిరిజావల్లభా! మీయొక్క ముక్తామయరత్న కుండల మీతీర్థమునఁ బడిన కతన నీతీర్థము సమస్తతీర్థములలో నుత్తమోత్తమమై ముక్తిక్షేత్రమై లోకవిఖ్యాత మగుఁగాత! విభూ! యీస్థానమందు వాగతీత మైనపరంజ్యోతిః ప్రకాశము ప్రసరించుటవలన యిద్దానికి కాశి యను నామము ఖ్యాత మగుఁ గాత! జగద్రక్షకా! శివా! నేను మఱియొక వరమును యాచించెదను. దయసేయుఁడు. సృష్టియందు జరాయుజాది నాలుగు విధముల భూతగ్రామములయందు ఆబ్రహ్మస్తంబ పర్యంతము జంతుసంజ్ఞ గల ప్రతిజీవమునకుఁ గాశి

యందు ముక్తిలాభ మొనగూర్పుఁడు. శంభూ! ఆయువు క్షణవినాశక మనియు, విపత్తి విపుల మనియు, సంపత్తి క్షణభంగుర మనియుఁ దలంచి యేప్రాజ్ఞులు మణికర్ణికాతీర్థశ్రేష్ఠమందు స్నానసంధ్యాజపహోమాదికములను, ఉత్తమవేదపాఠములను, దర్పణపిండదానములను, దేవతాపూజనములను, గోభూ తిల హిరణ్యాశ్వాన్న వస్త్ర భూషణ కన్యాదానాదికములను, అగ్నిష్టోమప్రభృతి యజ్ఞాదికములను, వ్రతోద్యాపనములను, వృషోత్సర్గములను, లింగప్రతిమాదుల ప్రతిష్ఠాపనములను సలుపుదురో వారికి ఏకమాత్ర మక్షయఫల మొనగూడుఁగాత! ఈశానా! ఆత్మఘాతము ప్రాయోపవేశనము తక్క తక్కుఁగల శుభకర్మము లీక్షేత్రమందు శ్రద్ధాపూర్వకముగ ఎయ్యవి సలుపఁబడునో యయ్యవి మోక్షప్రాప్తికి హేతుభూతము లగుఁగాత! జగదీశ్వరా! కాలాంతరమందునను తా నొనరించిన శుభకర్మములను గూర్చి పశ్చాత్తాపము నొందినను, నితరుల కెఱుకపఱచినను నయ్యవి నిష్ఫలములగును. ఈశా! మీ యనుగ్రహమువలన నయ్యవి ఫలవంతము లయి, యక్షయఫలము నొసంగుఁగాత! సదాశివా! భూతభవిష్యద్వర్తమానములయందు పేరొందు పుణ్యతీర్థము లన్నిటియందు నీతీర్థము ప్రాధాన్యమై శుభోదయమై వఱలుఁగాత! పార్వతీమనోహరా! దేవతలలో మీర లెవ్విధంబున మంగళప్రదుల రని పేరొందితిరో యవ్విధంబున నీ యానందవనము తీర్థసంతతులలో మంగళప్రద మని పేరొందుఁగాత! సాంఖ్యయోగ ఆత్మదర్శన వ్రత తపోదానాదికములవలన లభించు ఫలము మణికర్ణికా

స్నానమువలన లభించుఁగాత! జన్మజన్మాంతరోపార్జితపాప సంచయములు మణికర్ణికాతీర్థస్నానమార్జనాచమనములవలన నిర్మూల మగుఁగాత! గంగాధరా! ఎవరు తొలుదొల్త మణికర్ణికాస్నాన మాచరింపక గంగాస్నానము విశ్వేశ్వరాదిదేవతాపూజనము లొనరించెదరో వారికి గంగాస్నానాదికములు నిష్ఫలము లగుఁగాత! ఎవరు మణికర్ణికాస్నానమును తృణీకరించెదరో వారు బ్రహ్మహత్యాదికములవలన లభించు పాపఫలమునకుఁ బాత్రులగుదురు గాత!' యని యివ్విధంబున విష్ణుభగవానుఁడు వరదానములను బ్రార్థింప దేవదేవుఁడును భక్తవత్సలుఁడు నగు పినాకపాణి ప్రసన్నహృదయుఁడై 'మధుసూదనా! నీకోరికలు ఫలవంతములగుఁగాత!' యని వరదాన మొసంగి సతీయుతముగ నంతర్ధానుఁడయ్యె. జనకమహీధవా! తొల్లి యగస్త్యునకు స్కందుఁడు వినిపించిన తెఱంగున మణికర్ణికావృత్తాంతమును వివరించితి'' నని యాజ్ఞవల్క్యమహర్షి పలికెను.

మహర్షులారా! అనాయాసముగ ముక్తి నొసంగు పురవైరిపురిమహిమలు వింటిరిగదా! ఇంక నేమి తెలియఁగోరెదరు? అని భృగుమహర్షి యడిగెను.



# కాశీ మాహాత్మ్యము

## చతుర్థాధ్యాయము.



ఋషిచంద్రమా! తమముఖకమలమునుండి వెలువడు వాగమృతమును నెంత గ్రోలినను మాకర్ణంబులు తనియుట లేదు. కాశికాపురిమహిమాతరంగముల నోలలాడు మామనంబు లన్యతీర్థావగాహముల నాశించుట లేదు. కావున నవియె యింకను వివరించి చెల్పు మని తపసులు ప్రార్థింప, భృగుమహార్షి మఱియొకకథను జెప్పఁ దొడఁగెను.

### సువదనోపాఖ్యానము

పూర్వకాలమున సుగుణగణసంపన్నుఁడును సుందరవిగ్రహుఁడును, జనసమ్మతుఁడును నగు సువదనుఁ డను రాజవర్యుఁడు, పుత్రమిత్రాప్తజనసేవితుఁడై కాశికాపురిని వసియించుచు శివభక్తిపరాయణుఁడై శిష్టరక్షణ దుష్టశిక్షణానురక్తుఁడై ధర్మపథమ్మున శక్రునిబోలె రాజ్యపాలన మొనర్చుచుండెను. అతఁడు విధ్యుక్తముగఁ గ్రతుశతంబుల నొనరించి ప్రజల మెప్పును బడయుచుండెను. తనదు సర్వస్వమును యాగదక్షిణగ నొసంగి విశ్వజిత్తను సవనరాజమును జేయ నారంభించెను. తత్సమయమున, యాగవీక్షణకౌతూహలంబునఁ గమలజసుతుఁడు సనత్కుమారుఁడు సువదనుని యజ్ఞవాటిక కరుదెంచెను. అంత సువదనుఁ డమ్మునిచంద్రుని

బహువిధసత్కారపూర్వకముగ నాదరించి భక్తియుక్తముగ నర్ఘ్యపాద్యవిధులఁ బూజలొనరించి ప్రసన్నునిఁ జేసి సవినయముగ, "మహాత్మా! బ్రహ్మజ్ఞానతత్పరుఁడవు. షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవు. పద్మసంభవాత్మజాతుఁడవు. సర్వజనాంతరంగుఁడవు. నీరాకవలన నాగృహము పావన మయ్యె. నాజన్మము సార్థక మయ్యె. నాయాగము సాంగోపాంగ మయ్యె. నీయాగమన కారణ మెద్దియొ యెఱుంగ నామది తత్తఱమందుచున్న యది" యని విన్నవించెను. సువదనుని భక్తితాత్పర్యముల కెంతయు నంతరంగమున సంతసిలి సనత్కుమారుఁడు స్నిగ్ధగంభీరభాషణంబుల "రాజేంద్రా! సవనదర్శనలాలసమానసుఁడనై చనుదెంచితి. కన్నులారఁ గాంచితి. నాకోరిక లీడేరె. అజ్ఞానసాగరంబున మునింగి శక్రసామ్యమును గన నీకేల? మాయామోహితుఁడవై క్షణభంగురములగు స్వర్గసుఖముల నభిలషించి కాశియందు యాగ మొనర్చు చుంటివి. నాశనహేతువగు స్వర్గపదాభిలాషను బరిత్యజించి యీయజ్ఞము సార్థకమగునటుల నీశ్వరార్పణ మొనర్పుము. అందువలన చిత్తశుద్ధియును దత్వజ్ఞానమును అలవడును." అని వచించు తమ్మిచూలికొమరుని పలుకుల నాలించి సువదనధరావరుఁడు "మునివరా! నీయాజ్ఞ యనతిక్రమణీయము. నాపూర్వపుణ్యపరిపాకమున నీరాక సమకూడె. నాకు హిత ముపదేశింపు" మని పలువిధంబుల కైవార మొనర్చెను. అంత "కాశి పుణ్యరాశి. దానిమహిమలనంతములు. అయినను దొల్లి శంకరుఁడు పార్వతీసహితుఁడై నారాయణునకు వినిపించిన కాశీప్రభావమును వినిపించెద.

## కాశీమాహాత్మ్యము.

కౌశీతకీకులోత్తంసుఁ డగుమానుఁడను మునిపుంగవుఁడు యమునాతటంబున నాశ్రమ మొనర్చుకొని యందుఁ దపోనియతి నొప్పుచుండెను. అతనికి మాండవ్యుఁడు, ముద్గలుఁడు ననునిరువురు శిష్యులు గలరు. వారలు నిర్మలచిత్తులై, గురుశుశ్రూషాపరాయణులై నియతవిధంబున వేదంబులఁ బఠియించిరి. మానమునియాజ్ఞానువర్తియై మాండవ్యుఁడు, ఋత్విగ్వరుఁడై బలిచక్రవర్తియజ్ఞవాటిక కరుదెంచి యందునెలకొని యున్న మునిపుంగవులను, విప్రవర్యులను రాజముఖ్యులను గనుఁగొనెను. బలి మాండవ్యుని విధిపూర్వకముగఁ బూజలొనర్చి కర్మనియుక్తునిగ నొనరించెను. ఆతఁడు సర్వకర్మములను సక్రమమున సుపర్వులు మెచ్చునటులఁ బూర్తియొనరించెను. అంత బలి, మాండవ్యుని దిలకించి 'ధరామరవర్యా! మహానుభావుఁ డగుమానమునిముఖ్యుని నిందుఁ జనుదెంచి యజ్ఞపరిసమాప్తి నొందింపు మని పరిపరివిధంబులఁ బ్రార్థింప నా ప్రార్థనల నంగీకరించియు రాక తడయుట కేమి కారణము? మిము నేమని పనిచెను? తెలియఁబలుకుఁ' డని వేఁడుకొనెను. గురువరునియందు రాజునకుం గలభక్తితాత్పర్యములకు సంతసిలి 'రాజేంద్రా! మద్గురుఁడు మత్సమానుని ముద్గలుఁ డనుశిష్యుని వెంటఁగొనుచు ముక్తిధామమగు కాశికానగరమునకు బయలువెడలెను. మీయందలియనురాగమున యాగసమాప్తికొఱకు నను మీకడ కనిపెను' అనుమాండవ్యుని సాదరవచనంబుల నాలకించి, బలి 'తపోధనసంపన్నులు నిష్కాములు గదా! అట్టియెడ బ్రహ్మవిదుం డగుమానముని

కాశికరుగు నుద్దేశ్య మేమి? యదియొఱిఁగింపు' మని సానునయముగ మాండవ్యుని బ్రార్థించెను. అంత మాండవ్యుఁడు 'దైత్యేంద్రా! శంకర క్షేత్రము ముముక్షు ధామము. అపవర్గైకఫలదము. దేహాంతమున ముక్తి నొసఁగి కైలాసమునఁ జేర్చు వారాణసీపురమును బుద్ధిమంతు లెవరు గన నిచ్ఛగింపరు? అందు సలుపు శుభాశుభకర్మంబుల కక్షయఫలము లభియించును. మద్గురువరుఁడు మోక్షార్థియై యామరణాంతము శాంత భావమున నిరుపద్రవముగ నందు వసియింపఁ దమకొంబునఁ జనియెను. నేనును యాగమును బూర్తియొనరించి నిరంతరము గురుచరణశుశ్రూష నభిలషించి జన నున్నాఁడను.' అని పలుక 'ననఘా! మదీయయాగమును బూర్తి యొనరింపుము. నేనును నీతోఁ దావకగురువరు చరణారవిందముల దర్శింప వారాణసికిఁ జనుదెంచెద' నని బలి మాండవ్యునితోఁ బలుకుచు, యథోక్తముగ నధ్వరదీక్ష పూర్తి యొనరించెను. ఋత్విజకోటి కపారధనంబులు పారితోషిక మొసంగి తనియింపఁ జేసెను. కొలఁదికిమీఱినధనంబు బ్రాహ్మణుల కొసంగి, యత్యంతమందమున మౌనముని వాస మొనరించు వారాణసీ దర్శనోత్సాహమానసమున మాండవ్యునివెంట బయలువెడలెను. కతిపయదినములకు సురసిద్ధమునిగణంబుల నొప్పారుచుఁ, జూచువారియఘనాశనకారిణియగుకాశిం గాంచి సకల తీర్థావగాహ మొనరించి యందలిలింగరాజముల దర్శన మొనరించి మౌనమునికుటీరమును జేరిరి. మౌనముని వారలకు విధివత్ప్రాకారమున సన్మాన మొసంగ నయ్యిద్దఱు వందనముల నొసంగి ప్రాంతల నిలచిరి. అంత మౌనుఁడు బలిం

గని, 'కుశలంబుగ నధ్వరంబు పూర్తి యొనరించి ధౌతా ఘుఁడ వైతివిగదా!' యని పలుక, 'మహాత్మా! తమ కరుణ పెంపున మాండవ్యునిచే సకలకార్యమ్ములు ధర్మపథమ్మున సమాప్తి నొందినయవి' యని బలి ప్రత్యుత్తర మొసంగి సమయోచితముగ మౌనునియొద్దఁ జేరి 'గురువర్యా! బ్రహ్మవిద్యావిశారదా! వారాణసీక్షేత్రసంతతులలో వన్నె కెక్కు కారణ మెద్ది? మీర లేమి ఫలము నభిలషించి యిందు వసియించుచుంటిరి యను సంశయంబున నామనంబు సంచలించుచున్నయది. అర్హుఁడనైతినేని నాకయ్యదంతము తేటతెల్లముగ వినిపింపు' మని వేఁడుకొనియెను. బలిపలుకుల నాలించి మౌనుఁ డధిక ప్రీతితో నిట్లు చెప్ప నుపక్రమించె.

'దైత్యపుంగవా! వారాణసీమహిమమును వివరింప నేరితరము? తొల్లి కుమారుఁ డగస్త్యునకుఁ జెప్పిన తెఱంగు వినిపించెద. శ్రద్ధాళుఁడవై వినుము. కాశి సదాశివుని యవిముక్త క్షేత్రము. శంకరపార్వతుల శృంగారవనము. విశ్వేశ్వరాది త్రయస్త్రింశత్కోటిదేవతానివాససదనము. వేదవిహితపవిత్ర క్షేత్రసంతతు లన్నిటియందు నధికతరపవిత్ర క్షేత్రము. శశక మశక కీట పతంగ తురగోరగాదులైనను పంచక్రోశాత్మకమైన కాశియందు శరీరత్యాగ మొనరించిన నయ్యవి తప్పక నిర్వాణ పదమునొందును. సజ్జనులకుఁ గాశి సత్యయుగమువలె,నుత్తరాయణముభాతి, మహోదయంబుమాడ్కి నిరంతరము నొప్పారుచుండును. చతుర్వేదాధ్యయనమువలన లభించు ఫలము కాశియందు లక్షగాయత్రిమంత్రజపమువలన లభించును. అష్టాంగయోగసాధనమువలన లభించుఫలముకన్న నతిశయ

ఫలము కాశీసేవనమువలనలభించును. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములవలన లభించుఫలము కాశియం దొకదిన ముపవసించిన లభించును. ఇతరస్థలములయం దొక నూఱువత్సరము లుగ్రతప మొనర్చిన లభించుఫలము కాశియం దొకవత్సరము భూమిశయ్యావ్రతాచరణమువలన లభించును. ఇతరత్రఆజన్మ మౌనవ్రతాచరణమువలన లభించుఫలము కాశియం దొక పక్షము సత్యసంభాషణ మొనర్చిన లభించును. అన్యత్ర సర్వస్వదాన మొనర్చిన లభించుఫలమునకుఁ గాశియందు సహస్ర బ్రాహ్మణభోజన మొసంగిన ఫలము దశసహస్రగుణము లధికమై యొప్పును. సమస్తముక్తిక్షేత్రసంసేవనమువలన లభించుఫలము కాశియందు పంచరాత్రములు మణికర్ణికాసేవనము వలన లభించును. ప్రయాగస్నానమువలన లభించుఫలము శ్రద్ధాపూర్వకముగ కాశిని దర్శించినమాత్రమున లభించును. అశ్వమేధ రాజసూయాదియాగములవలన లభించుఫలము భక్తియుక్తముగఁ గాశిని దర్శించినమాత్రమున లభించును. కేవలము 'కాశి' యను నక్షరద్వయమును స్మరించిన తత్క్షణమున పాపసంచయములు దూరము లగును.' అని యిట్లు కాశీ మహిమాతిశయమును దెలియపఱచి, 'యిట్టిమహాక్షేత్రమును స్వర్గకామినై రక్తినిసేవణ మొనర్చు మూఢమానవుఁడు గలఁడా! నేను ముక్తిని గోరి పూనికతో నీయవిముక్తమును విడువక సేవించుచుఁ బరమేశుని పాదపద్మములను హృదంతరమున నునిచి భక్తియుక్తముగఁ గొలుచుచున్నాఁడ. స్వధర్మమును వీడక వసియించుచుఁ గాశియందు నమసిన మనుజులు జ్ఞానులకందని కైవల్యపదము సులభముగనొందుదురు. పూర్వ

పాపాకులాత్ము లగువారలకుఁ గాశి దుర్లభము. కాశియందు సందియమును వీడి నివసించుట యుత్తమము. సందిగ్ధహృదయుల కెందును గళ్యాణ మొనగూడుట దుష్కరము. అంత్యజాతివారికైనను నవిముక్తమరణము వ్యయములేని పుణ్యసంచయముల నొసంగును. దైత్యశేఖరా! మేను శాశ్వతముగ నిలచునది గాదుగదా! సంసారము శోకసాగరమనియు, కాశికానగరమున ముక్తియొనగూడుననియుఁ దలంచి, పండితులు మృత్యువు నభిలషించి యందు వేచియుందురు.' అని యిట్లు పలుకు మహానముని వాక్కుల నాలించి, బలియు కాశీవాస మొనర్పఁ గృతనిశ్చయుఁడై గురువరున కెఱుకపఱచెను. అంత మహానుఁడు, 'రాక్షసేశ్వరా! మనుజులకు కాశీవాస మనుచితము. అందు పాతకము లొనరించిన, తత్ఫలమంతమగువఱకు రుద్రపిశాచత్వ మొంది భైరవయాతనము ననుభవింపవలయును. కావున కాశీవాస మభిలషింపక, లింగస్థాపన మొనర్చి యిహాపరంబుల శాశ్వతయశంబును గనుము.' అని పలికెను. బలియు, మహానముని వాక్యానుగుణముగఁ గాశియందు లింగస్థాపన మొనర్చి తనదేశమున కరిగెను. సువదనభూపాలా! కాశియందొనర్చు సత్కార్యము శాశ్వతపుణ్యఫలము నొసంగునని సనత్కుమారుఁడు పలుక, మునివరులారా! సువదనుండు విశ్వజిద్యాగమును విశ్వనాథునకు ధారవోసి చిత్తశుద్ధి వడసి యంతమున ముక్తిఁజెందెను.

మఱియు, మీకు నింకొక యితిహాసమును వినుపించెదను.'' అని భృగుమహర్షి యిట్లు చెప్ప దొరఁకొనియె.

## దివోదాసు చరితము

"పూర్వకాలమునఁ బరమధర్మిష్ఠుఁడును, సత్యవాగ్ధర్మతత్త్వజ్ఞుఁడును, ధర్మమార్గావలంబియును, సకలభూపాలభూషణుండును నగు దివోదాసుఁ డను రాజముఖ్యుఁడు ప్రజారంజకముగఁ గాశీనగరమున రాజ్యపాలన మొనర్చుచుండెను. ఆతఁడు పుత్త్రకామిౘయై, భూరిసువర్ణముల భూదేవులకు దానము లొసంగుచు లెక్క కెక్కుడుగ నధ్వరంబుల నొనర్చుచుఁ జిరకాలము గడపినవాఁడయ్యెను. వంశవర్ధను లగు సుపుత్త్రు లొదవని యభాగ్యమునకు మదిఁ జింతిల్లుచు నాతని దారతార, దేవతారాధనము లొనర్చుచు భూసురుల కమితదానము లొసంగుచుఁ దుదకుఁ దనమనోరథ మొనగూడమికి వెతఁజెందుచుఁ దనభర్తపజ్జం జేరి తన మనోగతమును వెలువరించెను. మఱునాఁడు నలువాత రాజవర్యుఁడు విప్రవరుల రావించి దీనవదనుఁడై 'భూసురులారా! మీ కరుణారసము పెంపున సమస్త సంపదలను గలిగియున్నాను. పుత్త్రులు లేనికొఱంత నామనంబున బాధించుచున్నయది. మిముబోంటి మాననీయులు, సుతులులేకున్న గతులు లేవని పలుమరు వక్కాణించుచుందురు కావున నాయందు దయాతరంగితాంతరంగులై సుతులు గల్గు నుపాయమొండు లెస్స నాలోచించి కరుణింపుఁడు.' అని వినయపూర్వకముగఁ బ్రార్థించెను. రాజువ్యసనంబునకు మదిఁ గలంగి, ధరామరులలో నొక్కఁడు లేచి 'రాజశేఖరా! ఇంతకు గవ్యూతిమాత్రమున నికుంభేశుఁడు నెలకొనియుండెను. అద్దేవుని సేవనమువలనఁ బుత్త్రహీనులు పుత్త్రులంగని సంతసించుచుందు రనుఖ్యాతి

వినంబడుచుండు. నీవును సద్దేవదేవుని పదవనజంబుల భక్తి సేవించి మనోరథ మొనగూర్చుకొను' మని పల్కెను. అంతఁ దాశాపధూటియు 'నికుంభుని సేవించినఁ బుత్రవంతు లగుదు రని మున్ను వినియుంటి. పుత్రహీనులకుఁ బుణ్యగతులు గలుగవనియు, వారి పితరులు ముక్తిపదమున కరుగనేఱక యధఃపతితు లగుదు రనియుఁ బ్రాజ్ఞులవలన నెఱింగితి. ప్రమథగణసేవితుఁడగు నికుంభేశుఁడు మనకొదవ దీర్చు. ఆయనసేవ కరుగఁ జిత్తమందుఁ దలంపు నూనుఁడు' అని పలువిధముల నెచ్చరించెను.

అంత దివోదాసుఁడు సంతానకాంక్ష మది నుమ్మలింప భార్యాద్వితీయుఁడై పురోహితుని ముందిడుకొని విధ్యుక్తముగఁ బదిరెండు నెలలు నికుంభుని పూజలొనర్చెను. పుత్రసిద్ధి నొసఁగులక్షణములు నించుకంతయుఁ బొడగానక, 'కోమలాంగీ! మనపుణ్య మిట్టులుండ నికుంభుని దూర నేల? సకలైశ్వర్యములు గలిగియు వికలత్వ మొంది కొండంత యాసతో నికుంభుని సేవించితి. తుదకు మందభాగ్యుఁడ నగుకతన విఫల మయ్యె! నలుగురిలో సిగ్గు వాటిల్లె' నని కలగుండువడు పతిం దిలకించి 'జీవితేశ్వరా! పూర్వకర్మఫల మివ్విధంబునఁ బరివర్తింపుచు నుండ దైవ మేమి చేయఁగలఁడు? అన్యుల కొఱు మాసములలో కోర్కె లొనఁగూర్చు దేవుఁడు మనభాగ్యహీనత నొకసంవత్సరము సేవించినను మనోరథ మీడేరు చిహ్నము నను బ్రసాదింపఁడయ్యె. జీవమున్నంతవఱకు సేవించిన రిత్తవోవునా? అంతకును మనపూర్వజన్మకర్మఫలము క్షీణింప

కుండునా? దైవము మనకాంక్షితము నొసంగ ననుకూలుఁడు గాఁడా?' యని పల్కెను.

అంత దివోదాసుఁడు కోపపూరితదుఃఖమును బాపఁ జాలక తనపరివారమును జూచి 'నికుంభాలయమును సత్వరం బుగఁ జూర్ణముఁ జేసిరండు పొండు' అని ముదలనొసంగ క్షణ మాత్రమున దదాలయంబు నేలఁగూలనేసి తద్వృత్తమును రాజునకు నివేదించిరి. రాజభటులు తనమందిరమును రూపు మాపుటఁ గని నికుంభేశుఁడు, యీపాపబుద్ధిగర్వ మడంపకున్న మత్ప్రభావము హాస్యాస్పద మగునని హుంకరించుచు కోపోద్దీపితుఁడై స్వప్నమందుఁ బొడసూపి, 'దుర్మదాంధా! సంపద్గర్వంబునఁ గన్నుగానక మద్గృహంబు పాడొనరించితివి. ఇందులఫలము ననుభవింపుము. సత్వరంబున రాజ్యచ్యుతినొంది నిర్మనుష్యమగు క్రూరమృగసంకుల భయదారణ్యమున వేయి వత్సరములు దిరుగుచు, పెన్వగలం గుడుచుచు భగవత్క్షేత్ర విదూషణము దగదని తర్కించుచు మనుము. కలుషాత్ములు కాశియందు నివసింప నర్హులుగారు' అని శాప మొసంగి నిజ నివాసంబున కరిగెను. అంత దివోదాసుఁడు నిద్ర మేల్కొని నాగభూషణునిపలుకులఁ దలపోసి, "దుఃఖభాజనుఁడనై దుర్వి చారమున నికుంభునిమందిరమును జూర్ణము గావించితిని. శాపదగ్ధుఁడనైతిని. భగవదపచారుల కమంగళములు గాక మంగళము లొనగూడుట యెట్లు?" అని వితర్కింపుచుండఁ బ్రభాత మగుటయు, సమీపారణ్యమునఁ దిరుగాడు తాళ జంఘులు హయహయులు లయకాలానలోగ్రస్ఫురన్మూర్తులై నిశితాస్త్రధారులై చనుదెంచి రాజు నాక్రమించి దారుణరణ

మొనర్చిరి. హాయహాయులు తాలజంఘులు దైవబలసమన్వితులు గావున దివోదాసు నొక్కుమ్మడి క్షీణసత్త్వునిఁ గావించిరి. క్షీణసత్త్వుఁ డయ్యును దివోదాసుఁ డక్షీణసత్త్వుపగిదిఁ బోరాడి రణంబున నిలువలేక పూర్వదిక్ప్రాంతారణ్యములకుఁ బరువిడఁ జొచ్చెను. శత్రువులు లబ్ధవిజయులై పురము నాక్రమింపఁ బురజను లధికతరశోకాకులితహృదయులై దశదిశలకుఁ బాఱఁదొడంగిరి. దివోదాసుఁ డాలమున నోడి భయదాటవులఁ ద్రిమ్మరుచు దుర్మదాంధుఁడ నై దేవాగారమును గూల నేసి తత్ఫలముననుభవించుచుంటిని. అని మదిగుందుచు వెతలం గుడుచుచుఁ గొన్నినాళ్లకు భరద్వాజాశ్రమమును జేరెను.

విశేషదుఃఖమునఁ బొరలెడు నాజనపతిని భరద్వాజమునీంద్రుఁడు గని కుశలప్రశ్న మొనరించి 'నీవనటకుఁ గారణమది యే'మని యడిగెను. అంత నజ్జనపతి సాష్టాంగనమస్కృతులొనరించి నశ్రుజలము వెల్లివిరియ, మునిపుంగవుఁడు విస్మయమొంద జరిగినది జరిగినట్టుగ యావద్వృత్తమును వినిపించెను. అంత భరద్వాజుఁడు కరుణాంతరంగుఁడై 'రాజా! దుఃఖింపకుము. సుఖదుఃఖములు కాలానుగుణముగఁ జీఁకటివెన్నెలల సామ్యమునఁ దమంతటనె ప్రాప్తము లగును. తన యపరాధములవలన విపత్తులు సంభవించుచుండు. అయ్యవి యనుభవైకవేద్యములుగాక తప్పింప నేరితరము? ఫాలలోచనుఁడు శిష్టరక్షణముకొఱకు క్షేత్రతీర్థాకృతులు దాల్చి యచ్చట వసియించుచుండును. అందుఁ గాశి ముక్తివారాశి. స్వధర్మాయత్త మగుచిత్తవృత్తిని బ్రవర్తించు సజ్జనులకు బ్రహ్మభావ మొసంగుచుండును.' అని వారాణసీమాహాత్మ్యమును

వినుపింప, దివోదాసుఁడు మునివరేణ్యుని బ్రసన్నునిఁగాఁ జేసి తనదుష్కర్మమును వెడలనడుపు నుపాయమును వివరింపు మని ప్రార్థించెను. భరద్వాజుఁడు సాదరమున భూపతి నీక్షించి 'నికుంభునిశాసన మేరికిని దాఁట శక్యముగాదు. వేయేండ్లదనుక నీవు రాజ్యార్హుఁడవు గావు. అంతదనుక విశ్వనాథుని హృత్పద మునం దునిచి నిర్మలభక్తితో నిరంతరము సేవించుచుండుము. దాన నద్దేవదేవుఁడు ప్రసన్నుఁడై మే లొడఁగూర్చు' నని సదుపదేశ మొనరించెను. అంత నారాజు భరద్వాజుని హిత వచనంబుల నెమ్మది నునిచి 'మహాత్మా! శత్రువులపీచమడంపం జాలు నాహవదోర్బలాఢ్యుఁ డగుకొమరుని బ్రసాదింపు' మని వేఁడుకొన భరద్వాజుఁడు తదనుగుణముగఁ బుత్రకామేష్టి సేయించి పుత్రలాభ మొసంగెను. రాజపుత్రుని బలదర్పంబుల థాటి కోరువలేక హయహయులు తాలజంఘులు బీరము చెడి పలాయను లైరి" అని భృగుమహర్షి లోమశాదులకుఁ గాశీ మాహాత్మ్యమునువినుపించి "యవిముక్తక్షేత్రమున ధనాశా పీడితుఁడై దుర్దానమును బ్రతిగ్రహించిన మనుజుఁడు దుర్దశ లకుఁ బాత్రుఁడగును. ఇందుల కొక యితిహాసమును వివ రించెదను.

## ఆనంతునిచరితము

తొల్లి కాశియందుఁ గౌశికుఁడను విప్రకులుఁడు సతీయు తుఁడై శమదమాన్వితుఁడై స్వధర్మపరతంత్రమునఁ గాఁపురము సేయుచుండెను. వారలకు మారసుందరుఁడు, దురాచారుఁడు, పూర్వాచారవిదూరుఁడు, దుర్గుణపరుఁడు నగుసుకుమారతనుఁ డనంతుఁ డనుకొమరుఁ డుదయించెను. జననీజనకులు శైశవ

మునసే బ్రహ్మత్వ మొందిన సతండు శిక్షాహీనుఁడై మూఢజన శిరోమణి యని వాసి గాంచెను. అంత కాలానుగుణముగ యౌవనమంకురింప మదిరాపానలోలుఁడై విషమాస్త్రప్రేరణ మునఁ బొరుగుబ్రాహ్మణిఁ గూడి విహరించుచు నిరుపురతనయులఁ బడసి దుర్దానదురాన్నముల స్వీకరించుచు సంచరించుచుండెను.

అంతఁ గొంతకాలమునకుఁ బంచముఁ డొకఁడు కాశిం గనుఁగొన లెక్కకెక్కుఁడగు సువర్ణములఁ దీసికొని చను దెంచి మణికర్ణికాహ్రదంబున సుస్నాతుఁడై జాహ్నవీతీరమున సువర్ణముల రాశిఁ బోయించి ప్రదక్షిణ మొనరించి, విశ్వనాథుని హృదయకమలమునఁ గుదురుపఱచి, సన్నిహిత వర్తులగు భూసురులకు నమస్కరించి, 'విప్రవరులారా! నేను మాలవాఁడను. పితరులముక్తికొఱకు విశ్వేశ్వరార్పణముగ నీధనమును ధారవోసెదను. సంతసమునఁ గొనరండు. చండాలధన మని మదిఁ దలంపకుఁడు. ధనమునకు జాతిభేద మొందైనఁ గలదా! బ్రహ్మవేత్తలు సర్వమును బ్రహ్మమయ మని దలంచెదరు. మీరలు నాయందుఁ గరుణించి నే నొసర్చుదానమును బరిగ్రహించి నను దరిఁ జేర్పుఁ' డని బహువిధములఁ బ్రార్థింప, భూసురులు ఇయ్యది కాశీక్షేత్రము. ఇందు ముక్తిదాయకము లగుగంగయు, హరుఁడును, మణికర్ణికయు నిజభక్తవరుల కేకొదువయు వాటిల్లకుండు నటులఁ గాపాడుచుండ, క్షణభంగురము లగునైహికసుఖముల నాసించి యంత్యజునిధనమున కాసిలుట ధర్మవిరుద్ధము. ఐహికము నభిలషించి చండాలధనమును స్వీకరింపఁ జనదని కర్ణములఁ జేతుల నదుముకొనుచుఁ దమతమతావుల కరిగిరి.

అనంతుఁ డీవృత్తమును గర్ణాకర్ణిగ నాలించి తత్తీరమున కరు గుదేర, నామాలఁడు తిలకించి సంతసించుచు నవ్విప్రచం డాలునిపాదములం బడి దానమును స్వీకరింపు మని వేఁడు కొనఁ "బుళిందకులోత్తంసమా! యీధనము నంతయు నే నొక్కరుఁడనె దానము పట్టెదను. మఱియొకనికి నీయఁదలం చితివేని నే నొల్లను. ఇందుల కనుమతింతువేని సత్వరంబున నొసంగుము. లేదేని నేఁ జనువాఁడ" నని బదు లొసంగెను. అంత మాలఁడు ముదమంది వల్లె యని విధ్యుక్తముగ దాన మొసంగి నిజనివాసమున కరిగెను. అనంతుఁడును మది నుప్పొంగుచుఁ గ్రమంబున ధనరాసులను గృహంబునకుఁ జేర్చెను.

అనంతునివృత్తమును నాలించి, భూపతి కుపితుఁడై యనుచరుల రావించి 'చండాలునిధనమును నింద్య మని దలంపక ప్రతిగ్రహించిన విప్రచండాలుని మత్పురమున నిలవనీక వెడలనడుపుఁ' డని యాజ్ఞ నొసఁగ, వార లావిప్రుని సకుటుంబముగ నర్ధరాత్రమునఁ బురబహిష్కృతుని గావిం చిరి. అనంతుఁడు తనయకృత్యమును దలపోసి మదిఁ గుందుచు సతీసుతులు వెంట నంట నరణ్యమార్గమునఁజనుచో నొక్కెడఁ దస్కరు లడ్డుపడి ధనంబుల నొలుచుకొని వీరిని విడచిన మన గుట్టుముట్టును బుడమి ఱేని కెఱింగించి మనల మడియింతురు గావున వీరిని విడువక తప్పక వధియింపవలయు నని నిశ్చిత హృదయులై వాలు కేలం బూని శిరంబుల ఖండించిరి. బ్రాహ్మ ణులు తమతమదుష్ప్రవర్తనమున కనువగు ఫలమును గుడుచు చుంటి మని మది నెన్నుచు, విశ్వనాథునిచరణకమలములను

నిర్మలభక్తితో ధ్యాన మొనర్చుచు నలువురును ప్రాణంబులు గోలుపోయి తత్క్షణమునఁ గుక్కుటరూపములను వహియించిరి. అంతఁ జోరు లా కుక్కుటములను గని దయాళులై వాటిని కాశికానగరమునఁ జేర్చిరి. అవియుఁ బూర్వమునఁ గాశి యందు నివసించిన పుణ్యవశమున జ్ఞాన మొక్కింత యలవడి మణికర్ణికాస్నాన మొనరించుచు, విశ్వనాథమందిరమునకుఁ బ్రదక్షిణ మొనరించుచు, బల్యన్నంబుల భుజియించుచు, ముక్తిమండపమున సంయమివరులు చదువుపురాణముల నాలించుచు, జామున కొకమాఱు సంజ్ఞాస్వన మొనర్చుచు, ముక్తిమండపసన్నిధిని నివసించుచు శివభక్తియుక్తివలన ముక్తి వడసెను. మునిపుంగవులారా! అనంతునకుఁ గాశియందు దుర్దానమును సేకరించినకతనఁ గలిగినదుర్గతియు, నంతమున గాశి యందు భక్తియుక్తముగ మని దేహత్యాగ మొనరింప వడసినసుగతియు వినియుంటిరి గదా! ఇంకనేమి వినవలతురు." అని భృగుపుంగవుఁడు అడిగెను.

ఇది చతుర్థాధ్యాయము.

---

# కాశీమాహాత్మ్యము

## పంచమాధ్యాయము.

భృగుమహర్షి వచియించు కాశీమాహాత్మ్యమును లోమశాదిమునులు సభక్తికముగ నాలించి, యెంతయు ముద మంది, "మహాత్మా! కాశియందు నెలకొనియున్న లింగరాజము లను, తన్మాహాత్మ్యమును, గాశీవాసవిధియును గృపచేసి విను పింపవే" యని వేఁడుకొన, భృగుపుంగవుఁడు వల్లెయని యిట్లు చెప్పఁదొడఁగెను.

"మునితల్లజులారా! కాశియందలి లింగములు అసంఖ్యా కములు. వానిమహిమము లవాఙ్మానసగోచరములు. అయి నను నందు ఓంకారేశ్వరుఁడు, కృత్తివాసేశ్వరుఁడు, కపర్దీ శ్వరుఁడు, మధ్యమేశ్వరుఁడు నను లింగములు విశ్వేశ్వరలింగ మువలె సుప్రసిద్ధములయి, మహిమవంతములై యొప్పుచున్న యవి. అయ్యవి పవిత్రములును, గుహ్యతమములును, శుభ ప్రదములును, సర్వోత్తమములును నై విరాజిల్లుచున్నయవి.

### ఓంకారేశ్వరలింగము

ఇయ్యది పరమకళ్యాణప్రదము. దీనిస్మరణమాత్రమున సమస్తపాపములు దూరగతము లగును. ఓంకారేశ్వరుఁడు పంచాయతనరూపమును (బ్రహ్మ, విష్ణు, మహేశ, సూర్య, శక్తిస్వరూపముల నేకమాత్రముగ) ధరియించి క్రీడ సలు

పుచు, జంతుజాలమున కపవర్గదాయకుఁడై యొప్పుచుండును. ఎవరు పంచాయతనస్వరూపమగు నీ యవ్యయలింగమును స్మరించుచుందురో, వారలు శరీరాంతమునఁ బరంజ్యోతి స్స్వరూప మగు బ్రహ్మానందమున నిమగ్నులగుదురు.

## కృత్తివాసేశ్వరుఁడు

పూర్వకాలమున గజాసురుఁ డనురక్కసుఁడు కృత్తివాసేశ్వరుని బూజించుచు బ్రాహ్మణులను భక్షింప నుత్సాహమునఁ జనుదేర, భక్తవత్సలుఁ డగు త్రినేత్రుఁడు, తల్లింగమధ్యమమునుండి వెలువడి గజాసురుని దృణప్రాయముగఁ ద్రిశూలమున వధించి తచ్చర్మమును వసనముగ ధరియించెను. అందు వలన నచ్చటిలింగము కృత్తివాసేశ్వరుఁ డనునామమునఁ బ్రసిద్ధి గాంచినదయ్యె. మునిపుంగవులారా! కృత్తివాసేశ్వరుని సేవించినమహర్షులు సశరీరముతోఁ బరమపదమును బడసిరి. అధర్మరతు లగు కలియుగమానవులు కృత్తివాసేశ్వరుని సేవించిన నిస్సంశయముగఁ గృతార్థు లగుదురు. కృత్తివాసేశ్వరాలయము సమస్తసిద్ధుల కాలయము. అందువలన దేవాధిదేవుఁడు శంకరుఁడు తత్థానమును గుప్తముగ నునిచెను.

## కపర్దీశ్వరలింగము

కపర్దీశ్వరుని స్మరణమాత్రముననే సమస్తపాపములు వినాశమును జెందును. వారాణసియందు నివసించుసమయమునఁ గామక్రోధాదులవలనఁ బ్రాప్తమగు సమస్తదోషములు కపర్దీశ్వరుని సేవనమువలన దూరముగఁ దొలఁగిపోవును. అందువలనఁ బ్రయత్నపూర్వకముగఁ గపర్దీశ్వరుని సందర్శన మొనర్పవలయును. శాంతచిత్తులును, ధ్యానపరాయణులును

నగు యోగిజనులకుఁ గపర్దీశ్వరుఁ డాఱుమాసములలో యోగసిద్ధి నొసఁగును. కపర్దీశ్వరునిమందిరసామీప్యమున పిశాచమోచన మను కుండ మొండు గలదు. అందు స్నాన మొనరించి కపర్దీశ్వరుని పూజసలిపిన, బ్రహ్మహత్యాదిపాప ములు తత్క్షణమున వినష్టములగును.

పూర్వమందు నీస్థానమున వ్రతపరాయణుఁడును, మహా తపస్వియును నగు శంకుకర్ణుఁ డను యోగివరుఁ డేడఁబాయక కపర్దీశ్వరుని నిరంతరము సేవించుచు వాస మొనర్చుచుండెను. ఒకానొక సమయమున నత్యంతక్షుధాతురమున నొప్పి శల్య మాత్రావశిష్ట యగు పిశాచ మొండు చనుదేర, నమ్మునిరాజు దానిఁ గని, పరిపూర్ణదయాంతరంగుఁడై 'నీవెవరు? ఎందుండి యిందుఁ జనుదెంచుచుంటివి?' యని ప్రశ్న మొనరించెను. అత్యంతక్షుధాతుర యగు నప్పిశాచి, 'దేవా! నేను బూర్వ జన్మమున నత్యంతధనధాన్యసమృద్ధుల నొప్పుచు, పుత్త్రపౌత్త్ర యుతమగు మత్కుటుంబమును బోషించుకొనుచువిశేషసంతోష మున మెలంగిన బ్రాహ్మణుండను. ధనలోభమున దేవబ్రాహ్మణ పూజయుఁ బుణ్యకార్యమును నెన్నఁడును సలిపియుండ లేదు. ఒకప్పుడు వారాణసీక్షేత్రమున వృషభవాహనారూఢునివిశ్వే శ్వరుని దర్శనమును, దల్లింగస్పర్శనమును నొనర్చితిని. పిమ్మట నచిరకాలమున మృత్యువు వాతఁబడితిని. మునివరా! ఏమని చెప్పుదు? కాశీవిశ్వేశ్వరసందర్శనలబ్ధ సుకృతప్రాబల్యవిశేష మునఁ గాలుని భయంకరముఖమును గనుఁగొన లేదు. జన్మాం తరకుకర్మపరిపాకముననీపిశాచత్వమును బూని క్షుత్పిపాసలకు లోనై హితాహితంబుల నెఱుంగక తిరుగుచుంటిని. ప్రభూ!

నీకు శరణాగతుఁడ నైతి. నాయందుఁ గరుణయుంచి యీ పిశాచరూపమునుండి విముక్తి యగు నుపాయమును సెల వొసంగుఁడు.' అని ప్రార్థనాపూర్వకముగఁ బ్రణతు లొనరించెను. భూతదయాపరుం డగు శంకుకర్ణుఁడు పిశాచవాక్కుల నాలించి 'యీ ప్రపంచమున విశ్వనాథుని దర్శనస్పర్శనసేవనము లొనరించిన నినుబోలు పుణ్యాత్ము లితరు లేరును లేరు. ఏతత్సుకృతపరిపాకమున నీవు తిరిగి యిందుఁ జనుదెంచితివి. ఇపుడు నీవు సావధానచిత్తుఁడవై యీకుండమున స్నాన మొనరింపుము. దాన, నీకుత్సితస్వరూపముననుండి శీఘ్రమున వెలువడుదువు' అని సాదరమునఁ బలికెను. అంత పరమదయాకరుం డగు మునిరాజు వచనంబుల నాలించి యాపిశాచి, త్రినేత్రధారి యగు దేవదేవుని గపర్దీశ్వరుని ధ్యానించుచు సావధానముగ నాకుండమున స్నానమొనరించెను. మునివరులారా! పిశాచమోచనస్నానప్రభావమున నప్పిశాచము, శంకుకర్ణుని సమీపమునఁ బిశాచత్వమును వీడి దివ్యభూషణభూషితుండును, శశాంకచిహ్నాంకితచారుమౌళివిలసితుండును నయి సూర్యప్రతిభాభాసమానవిమానరాజమున దృగ్గోచరుఁడయ్యె. ఉదయకాలమునభాస్కరుఁడు సమస్తదేవతాశోభితుఁ డగు వడువునఁ గైవల్యపదమున రుద్రగణశోభితుఁ డయి వాలఖిల్యాదియోగిజన సమావృతుఁ డయి ప్రకాశించుచుండెను. ఇవ్విధమున నప్పిశాచమునకు ముక్తి కలిగి, కైవల్యపద మొనగూడుట కనుంగొని శంకుకర్ణుఁడు దేవదేవుని సభక్తికముగ స్తుతింప, నాతఁడు ప్రసన్నుఁడై కోటికాలాగ్నిసన్నిభమును, జ్ఞానానందాద్వైతస్వరూపమును నగు లింగ

రూపమునఁ బ్రకాశమానుఁ డయ్యెను. శంకుకర్ణుఁడు తల్లింగ మున లీనమై యమృతపదమును బడసెను.

ఒకప్పుడు మహర్షులు కపర్దీశ్వరుని బూజించు సమయ మున నొక బాలమృగమును, భయంకరశార్దూల మొకటి వెంటఁదగుల నయ్యది కపర్దీశ్వరునిచెంత కరుదెంచి భీత హృదయ యయి ప్రదక్షిణ మొనరింపుచుఁ బరుగిడుతఱి వ్యాఘ్రవశమయ్యెను. అంత నావ్యాఘ్రము, తనతీక్ష్ణనఖ ముల నామృగకిశోరమును జీల్చి చంపి, మునితిలకుల విలో కించి యందు నిలువక నిర్జనప్రదేశమున కరిగెను. కపర్దీశుని సమ్ముఖమున నాలేడిపిల్ల ప్రాణత్యాగ మొనరించినకతన నయ్యది పరమపదమును బడసెను.

## మధ్యమేశ్వరలింగము

పంచక్రోశాత్మక మగు వారాణసీపురమధ్యమున నెల కొనియుండుకతన లింగరాజమునకు మధ్యమేశ్వర మను నామము ఖ్యాతమయ్యె. ఇందు మహేశ్వరుఁడు పార్వతీ సహితముగ రుద్రగణపరివృతుఁ డయి నిరంతరము క్రీడ సలుపుచుండును.

పూర్వకాలమున దేవకీనందనుఁడు పాశుపతగణపరివృ తుఁడై, భస్మధారియై వర్షసహస్రములు రుద్రదేవుని యుపా సన మొనర్చెను. అంత మహేశ్వరుఁడు ప్రసన్నుఁ డయి, 'జగన్మయా! విధిపూర్వకముగ గోవిందుని నారాధన మొన ర్చిన భక్తులకు నీశ్వరత్వ మలవడును. నీవు నాభక్తులకుఁ బూజనీయుఁడవు. నిను బూజించు భక్తులకు మత్ప్రసాదమున

శుభపరంపరలు చేకూరును. పినాకపాణిని ధ్యాన మొనరిం చుచు, గోవిందుని సందర్శనమొనరించువారలు బ్రహ్మహత్యాది మహాపాతకములనుండి విముక్తు లగుదురు. పాపభూయిష్ఠు లగు మనుజు లైనను నీస్థానమునఁ బ్రాణత్యాగ మొనరించిన నిస్సంశయముగఁ బరమపదమును బడయఁగలుగుదురు. ఇందలి మందాకినీజలమున స్నాన మొనర్చి మధ్యమేశ్వరమహాదేవుని పూజ సలిపినవారలు ధన్యు లగుదురు. మందాకినియందు స్నానమొనరించి, దానము, తపము, పిండదానము మొదలగు నవి భక్తిపూర్వకముగ సలిపిన, నొక్కొక కర్మమునకు నేడేసి కులములు పవిత్రము లగును. సూర్యోపరాగమునఁ గురుక్షేత్ర స్నానమున లభించుఫలముకన్న మందాకినియందు స్నాన మొనర్చిన దశగుణాధికఫలము ప్రాప్తమగును.' అని వరదాన మొసంగి యంతర్హితుఁ డయ్యెను.

మునివరులారా! ఇఁకఁ గాశీవాసప్రకారమును వినుపిం చెదను. శ్రద్ధాళులై యాలింపుఁడు. కామార్థదంభమాత్సర్య ములను ద్యజించి ధర్మమోక్షవిచారణాతత్పరులై కాశీసేవన మొనర్పవలయు. శాంతదాంతములను దాల్చి శంకరుని నేకా గ్రచిత్తమున ధ్యానమొనరించుచు దానప్రతిగ్రహణపాతక మును నివృత్తి యొనరింపవలయు. గృహమేధులు తమకుఁగల వానితోఁ దృప్తి నొంది స్వధర్మమును నెడఁబాయక యతిథి సత్కార మొనరించుచు నివసింపవలయు. ధర్మతత్పరులు కాశీవాసమునకు నర్హులు. వర్ణభేదమును గణుతింప వలువదు. అధర్మపరులను, బాపభూయిష్ఠులను,నీర్ష్యాపరతంత్రులను గాశి యందు నిలువనీక శంకరుఁడు వెడలనడుపును. తొల్లి మహా

తత్త్వసంపన్నుఁడగు కృష్ణద్వైపాయనుఁడు శంకరునియందు నీర్ష్యాకులహృదయుఁడై కాశినుండి వెలియయ్యెను." అని భృగుమహర్షి వచియింప, మునివరులు "మహాత్మా! బ్రహ్మజ్ఞాని యగువ్యాసుఁడు శంకరునియందు ద్వేష మూనఁదగుకారణ మెయ్యదియని మామనంబులు సంశయాస్పదము లగుచున్న యవి. మాసంశయనివారణమును గావింపవే" యని వేఁడు కొనెను.

అంత భృగుమహర్షి మునులం జేరి, "యొకానొకసమ యమున సహస్రసంఖ్యాధికశిష్యగణపరివృతుఁడయి, నారా యణాంశసంభూతుఁడగుసత్యవతీతనూభవుఁడు కాశీపురమున కరిగి, సంవర్తమున్యాశ్రమమున నాశ్రమ మొనర్చుకొని యీ శ్వరధ్యానాయత్తచిత్తు లగునిజశిష్యవరులకు వేదాంతమార్గో పదేశ మొనర్చుచుండెను. ఆకోలాహలమున సంవర్తముని ధ్యానైకచిత్తమునకు భంగము కలిగెను. అంత సంవర్తకుఁడు వ్యాఖ్యానతత్పరుఁ డగువ్యాసునిఁ డిలకించి, భట్టారకునిగా నెఱంగియు, 'మీర లెవరు? ఎందుండి చనుదెంచితిరి? ఇట చనుదెంచి యెంతకాల మయ్యె?' నని ప్రశ్న మొనరించెను. సంవర్తకుని యీప్రశ్నలను వినియు, విననియటుల నటియిం చుచు వ్యాసుఁడు బదులు చెప్పలేదు. అంత జైమిని చిరు నగవు మొగంబునఁ జెంగలింప 'మీరలు సాక్షాన్నారాయ ణుండును, విద్యాసముద్రుండును నగుసత్యవతీకుమారువ్యాసు నెఱుంగకుండుట కడునాశ్చర్యము. ప్రసంగవశమున నైమిశా రణ్యముననుండి కాశి కరుదెంచిరి. వస్తుతః ~~ఈమహానీయుఁ~~ డెందు నిలచునో నయ్యది సంపూర్ణతీర్థాకరమును, బుణ్యధా

మమును, శుభదాయకమును నై యొప్పును.' అని బదులొసం గెను. సంవర్తకుఁడు జైమినివాక్కుల నాలించి, పరిహాసముగ 'మునిపుంగవా! కాశి కరుదెంచి క్రూరవచనంబులఁ బల్కుకుము. భగవంతుఁ డగువేదవ్యాసుని నే నెఱుఁగనివాఁడఁ గాను. ఆతఁడయినను ధర్మబాధకమగు చేష్టను విడువవలయును.' అని పలికెను. అనంతరమున వ్యాసుఁడు పరిహాసించుకొనుచు శిష్యవరులకుఁ గాశీకథావిధానమును వినుపింపఁ బ్రారంభించి 'నే నెట్టి యధర్మమును సలిపియుంటిని' అని సంవర్తకుని నడిగెను. అంత సంవర్తకుఁడు, 'వేదవేదాంగపారంగతా! ఇయ్యది తీర్థములలో నుత్తమతీర్థమును, క్షేత్రములలో సత్క్షేత్రమును నగుకాశీపురము. దీనిదర్శనమాత్రమున సమస్తపాపములు సత్వరమున నశియించును. ఇందు మరణ మొందు ప్రాణులు సర్వోత్కృష్టపదమును వడయును. అనేకసంవత్సరములు నిర్విఘ్నముగ ఘోరతపము సలిపిన ప్రాప్త మగు పుణ్యఫలము, ఇందు మూఁడురాత్రులు నివసించిన ప్రాప్తమగును. ఇందు శరీరత్యాగ మొనరించుజీవులు బ్రహ్మైక్యప్రకాశిక యగు తారకమంత్రమును వడయును. అనేకజన్మములందు ననేకసుకృతము లొనరించినను ముక్తి నందుట సందియము. ఇందు నొకజన్మమున నిస్సంశయముగ ముక్తి యలవడును. ఇట్టి మహిమావంతమగు పుణ్యక్షేత్రమున కరుదెంచియు, శిష్యసహితముగ చక్రపుష్కరిణీస్నానమును, ఈశ్వరసందర్శనమును నొనరింప లేదు. ఇద్దియె ధర్మబాధకము. అందువలన సత్వరమున బయలు వెడలి యాత్రవిధి ననుసరించి ప్రవర్తింపుము.' అని హితము నుపదేశ మొనరించెను. సంవర్తకుని వచనముల నాలించిన

పిమ్మట వ్యాసుఁడు శిష్యసహితముగ మణికర్ణికాతీర్థమున స్నానమాడి విశ్వనాథునిసేవించి, గౌరీగణేశుల దర్శనానంతరమున ముక్తిమండపమున కరిగి సుఖాసనాసీనుఁడై రుద్రసూక్తమును పారాయణ మొనర్చుచుండెను. తత్సమయమున వ్యాసుని భక్తితత్వమును నెఱుంగఁ దలంచి, తత్సమ్ముఖమున కుటిలబీభత్సములరెంటిని కుదురుపఱచి భయంకరాకారమున శంకరుఁడు ప్రకట మయి నిలువ, వ్యాసశిష్యులు ఎంత వారించినను నిటునటు కదలఁడయ్యె. అంత వ్యాసుఁడు రోషాకుల హృదయుఁడయి, క్రోధోద్భూతరూక్షవీక్షణుఁడయి శాపమిడ నుంకింప, శంకరుఁ డంతర్హితుఁ డయి నిర్మలశరత్కాలపూర్ణశశాంకాయుత సుప్రభాశోభితుఁడును, సూర్యచంద్రాగ్ని నయనుండును, దశభుజుండును, శశాంకశోభిత శిరస్థలుండును, శాంకరీ పరివృత వామాంగుండును, నానావిధ సముజ్వలాయుధ ధరుండును, పన్నగేంద్రభూషణుండును నయి శంభుండు చనుదేర, కృష్ణద్వైపాయనుఁడును, తచ్ఛిష్యులును, తక్కంగల మానులును ముదమంది యభినుతు లొనరించి ప్రణతు లొసంగిరి. అంత విశ్వేశ్వరుఁడు కోపారుణితనయనుఁడయి వ్యాసుని వీక్షించి పరుషభాషణముల 'నీ వెచటికైనఁ జనుము. ఇట నిలువఁదగవు. సాధుమతులు గాక రాగద్వేషాయత్తచిత్తులు కాశీపురమున నివసింప నర్హులుగారు. నీవునాభక్తుఁడవని యెఱుఁగుదును. అయినను, నీవు కాశీపురమునకు వెలియై తత్సమీపమున నివసించుచు నిష్కాముఁడవై మన్నామమును నిరంతరము జపియింపుచుండుము. రాగద్వేషసహిత మగునీహృదయము పరిపక్వమును వడసినపిమ్మట నీకు కాశీవాస మొసంగుదును.' అని

పలుక ద్వైపాయనముని శంకరునకు నమస్కరించి, తదాజ్ఞ శిర
మున నిడుకొని శిష్యసహితముగ బయలువెడలి కాశీపుర
బహిఃప్రదేశమున తపము సలుపుచు నొప్పుచుండెను. మహర్షు
లారా! మీకు వ్యాసచరితమును వివరించితిని. ఇఁక కాశీపుర
పరిమాణమును దెల్పెదను.

మధ్యమేశ్వర మాది దేహలీవినాయక మంత్యముగ
సూత్రమును స్థాపించి నలుదిక్కులఁ ద్రిప్పిన నాటుకొనెడు
మండలాకృతి రేఖకు నడుమనుండు క్షేత్రము పుణ్యప్రదమగు
కాశీక్షేత్రము.

దక్షిణోత్తరములయందు 'వరుణ' 'అసి' యను రెండు
నదులును బూర్వసీమను జాహ్నవియును, బశ్చిమమున బాశ
పాణిగణేశ్వరుఁడును దవిలియుండు ప్రదేశము వారాణసీ
క్షేత్రము.

విశ్వేశ్వరునిచుట్టి నలుదిక్కుల ధనుశ్శతయుగ్మపర్యం
తము నొప్పుచుండుప్రదేశమును నవిముక్తమని యందురు.
ఇందు ముక్తి వడయుట నిస్సంశయమని మౌనిసంఘములు
నిరంతర మెడఁబాయక సేవించుచుందురు.

పూర్వదిక్కున గంగయు, దక్షిణమున బ్రహ్మాజ్ఞానేశ్వ
రుఁడును, పశ్చిమమున గోకర్ణేశ్వరుఁడును, నుత్తరమునభారు
భూతపరమేశ్వరుఁడును నెలకొనియుండు స్థలము విశ్వనాథుని
లీలాగృహమనియు నంతర్గృహమనియు వాడుక గలదు.'

అని పలుక మహర్షులు 'మునివరా! విశ్వనాథపురవర
మును జతుర్విధక్షేత్రములుగ వివరించితిరి. ఆయాస్థలముల
యందు దేహము వీడినజంతుసంతతికి నేయే ఫలము లొన

గూడునో వేలు వేలు విధముల వినుపింపవే' యని వేఁడుకొన, భృగునందనుఁడు 'మునివరులారా! యీనాలుగు క్షేత్రములలో జంతుకోటి యెందు దేహము విడచినను నీశ్వరుఁడు భేద మరయక సత్వరమునఁ దారకమును నొసంగుకతనఁ బునర్జన్మము లభియింపదు. అందువలన విబుధులు ముదితహృదయులై మృత్యువు నాశించి కాశియందు వాసమొనరింప నిచ్ఛగింతురు. కాశియందు గిట్టినజంతువులకెల్ల సాలోక్యము గలుగును. అటమీఁద నీశ్వరస్వరూపమును దాల్చి సామీప్యమును బడసి, పిదపసాయుజ్యమునుగనుదురు. కాశీక్షేత్రమున మరణముగనిన జంతుసంతతి చతుర్విధముక్తులనుబడసి పిమ్మట బ్రహ్మైక్య మొందును. అంతర్గృహమందు మృతినందినపుణ్యులు కైవల్యపదమును జూఱగొని నిత్యసుఖులై బ్రహ్మైక్యమును బొందుదురు. బ్రహ్మైక్యసంధానమగు తారకంబను నోంకారతత్త్వమును మరణకాలమున నీశ్వరుఁడు దెలుపును. విశ్వేశ్వరాలయమును బ్రమాదవశమున జుట్టివచ్చినను పాపపరిహారమగును. ఇఁకఁ బ్రయత్నపూర్వకముగఁ బ్రదక్షిణము లొనరించిన విగతపాపు లగుట కేమి సందియము? అయనద్వితయము నియతపూర్వకముగఁ గాశికిఁ బ్రదక్షిణము నిర్వర్తించిన మహాపాతకములు డుల్లిపోవును. అంత్యమున మోక్షపదము లభించును. రుద్రమంత్రమును జపించుచురుద్రసూక్తములను బఠించుచు విజితేంద్రియుఁడై నిజధర్మములను వీడక విరక్తిగలిగి విశ్వేశ్వరుని సేవించిన మనుజుఁడు బ్రహ్మైక్యసంధానపరుఁడగును. కాశీసేవనము, విశ్వేశ్వరసందర్శనము, మణికర్ణికాస్నానము, గంగాతీరవిహారము జన్మాంతర సుకృతపరిపాకమున

దైవనియతిగ సంభవమగును గాని పౌరుషమున నెంతమాత్ర
మును బొసఁగ నేరదు. ఇందుల కొకచిన్నకథ గలదు. దాని
నెఱింగించెదను.

## వణిజానికథ

దక్షిణసముద్రతీరమున నివసించు వణిజుఁ డొకఁడు
తనజనని మృతి నొంద, తదస్థికల నవిముక్తమున కరిగి సుర
దీర్ఘికలో వైచినఁ బరమపద మబ్బునని దలంచి సంగ్రహించి
పేటికయందు నునిచి తలనిడుకొని కాశి కరుగుతెరువుఁ బట్టి
చనుచుండెను. జననికిఁ బరమపద మొసఁగు తమకమున శీఘ్ర
గతిం జనుచు నేకభుక్త మొనరించుచు పెక్కుదేశములు
దాఁట, మార్గమధ్యమున విశ్రాంతిఁ బడయనికతమున నభిఘాత
జ్వర మభిముఖమై యాతని వేధింపఁజొచ్చెను. అయినను
నావణిజుఁడు సభయుఁడు గాక పయనముసేయుచు నొకపల్లెఁ
జేరి, మూటమోయుట కొక భృత్యుని నలవఱచుకొని కతి
పయదినములకుఁ గాశీసమీపమున కరుదెంచి యొకపల్లెయందు
విడిసి, భృత్యుని మూటను నందొక గృహమున నునిచి భోజన
సామగ్రి దే నరిగెను. అంత భృత్యుఁడు మూటయందుఁ దప్పక
ధనమున్నదని దలంచి మూట గొని తన పల్లెకుఁ బరువిడఁ
జొచ్చెను. అంత నొక్కింతసమయమున కవ్వణిజుఁడు భోజన
వస్తువులను సంగ్రహించుకొని విడిది కరిగి భృత్యుని గానక
అస్థిపేటిక సంగ్రహించి చనె నని కృతనిశ్చయుఁడై పేరెలుం
గున భృత్యునిఁ బిలచుచుఁ బలువిధములఁ దల్లిం దలపోసి విల
పించుచుఁ దనపరిశ్రమము నిష్ఫలమయ్యె నని మదిఁ గుందుచు
నాభృత్యుఁడు వసియించు బోయపల్లె కరుగుమార్గమున నడ

చెను. తల్లియందలి భక్తితాత్పర్యముల పెంపున నా బేహారి, యాఁకలిడప్పుల సరకుగొనక కతిపయదినములకు భిల్లునియిల్లుఁ జేరి, తస్కరునివార్త నాతనియిల్లాలి నెంత యడిగినను దెలియఁ బలుకనందున నందుఁ గొంతకాలము వేచియుండెను. ఇట భిల్లతస్కరుఁడు పేటిని హరియించి కానం బోవుచు నొక్కెడ నా పేటికను విప్పి పునుకలం గాంచి, తనదురవస్థకుఁ దల్లడిల్లి, వాని నందుఁ బాఱఁజల్లి, తనపల్లెకరిగి, వైశ్యుఁ డేతెంచు నేమో యని భయము నొందుచు మాఱువేషమున తిరుగు చుండెను. బేహారి భిల్లపత్నిని జేరి వెరపు మాన్పి, నమ్మిక లొసఁగి, కొంతధనమును బారితోషికముగ నొసంగి భిల్లుని జూపు మని ప్రార్థింప, నామె వణిజుని దుస్థితికి జాలినొంది పతిని జూపి వారలకు సఖ్య మొనరించెను. అంత భిల్లుఁడును బేహారియుఁ గలిసి యస్థికలను జల్లినచోటున కరిగి యెంత వెదకినను వానిని గనుఁగొనఁజాలరైరి. అస్థికలను గనుఁగొను తెరువుగానక, యాఁకలిడప్పులు తన్ను నలమికొన, నా వైశ్యుఁడు క్రమ్మఱ వారాణసి కరుగ నేటికని మది నెన్నుచుఁ దనయింటికిఁ దాఁ జేరెను. మునివరులారా! చూచితిరా! శంకరునికరుణ లేనికతమున నావణిజుఁ డెంత ప్రయాస మొంది నను గాశిం గనఁజాలనివాఁడయ్యె.

కాశియందు ముక్తి వడయుట కేమిసందియము? సమ స్తతీర్థములం గూడి యొప్పు స్వర్నదియే జంతుసంతతికి ముక్తి నొసంగును. జాహ్నవీజలకణవితతిచేతఁ దడిసినప్రాణులు కిల్బి షములఁ బాసి పవిత్రములై యపవర్గపదమును బడయఁగలు గును. ఇఁక నందు మునుకలిడిన ముక్తి గన సందియ మెద్ది?

దూరదేశముల మృతులగువారి యస్థికలు దైవయోగమున గంగాజలమునఁ బడినంతనె, విగతకలుషులై యఱువదివేల వత్సరములు స్వర్గపురమున నిలచి భోగపరంపరల ననుభవించు చుండఁ, దత్తీరమునఁ బ్రాణము వీడినవానిసంగతి నిఁక వేఱఁ జెప్ప నేల? ఒక రొకరు చేయనోపినకార్యమును, విశ్వనాథుఁ డును గంగయుఁ జేరి నిర్వహించుచు జంతుసంతతికి నిర్వాణ పదము నొసంగుచుఁ గాశీపురమున విహరించుచుండిరి.

మునివరులారా! ముక్తిప్రదాయక మగుకాశీమాహాత్మ్యమును మీకు వినుపించితిని. దీనిని నీర్ష్యారహితులై పఠించుమనుజులు మనోవాంఛాఫలసిద్ధి నందుదురు. నిత్యమును గాశీమాహాత్మ్యమును బఠించుచు, నష్టోత్తరశతపార్థివలింగము లను బూజించుచు నొకవత్సరము కాశీపురమున నివసించిన మనుజుఁడు శీలవంతుఁడును, సుగుణగణశోభితుఁడును, దీర్ఘాయురుపేతుఁడును, ధనసంపన్నుఁడును, నీశ్వరారాధన తత్పరుఁడును నగుపుత్త్రుని బడయును' అని భృగుమహర్షి పలికెను.

శౌనకాది మునిపుంగవులారా! ఇత్తెఱంగున భృగువరుఁడు సకలకిల్బిషహారమగు కాశీపురమాహాత్మ్యమును లోమశాదిమహర్షులకు వినుపించినవిధంబున మీకు నేను వినుపించితిని." అని సూతుఁడు వచియింప, శౌనకాదిమహర్షులు సంతుష్టాంతరంగులై తమతమనివాసముల కరిగిరి.

ఇది పంచమాధ్యాయము.

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

శ్రీమదుమామహేశ్వరాయ నమః.

# కాశీయాత్ర



కాశీయాత్రాక్రమము, శ్రీస్కాందపురాణాంతర్గత మగు కాశీఖండముననే గాక, పలు పురాణములలో వర్ణింపఁబడి యున్నది. అందువలన యాత్రాపరులు బహుపురాణచోదిత మగు యాత్రావిధానమును దెలిసికొను సామర్థ్యము కలిగి యుందు రనునమ్మకము కలుగనందున, నానేర్చినకొలఁది యాత్రావిధిని సంక్షేపముగ నిందుఁ బొందుపఱచుచున్నాఁడ. ఇందువలన యాత్రాభిలాషులకు విస్తారముగాక, కొంతవఱ కైనను సామాన్యవిధిః బ్రాప్తమగు నని నాయాశయము. దూరదేశములనుండి కాశీయాత్ర కరుదెంచు యాత్రార్థులు, యాత్రవిషయములను స్వయముగఁ దెలిసికొనఁ జాలరు. మఱియు, యాత్ర జరిపించువారలు కూడ గ్రంథావగాహము చాలనందున నసమర్థులని నానిశ్చయము. అంతియ కాక, యాత్ర వాసులు కాలవిలంబనను సహింపనోపని కతమున విధ్యుక్తముగ యాత్రావిధి ననుసరించుటయును లేదు. యాత్రికులు విధ్యుక్తయాత్రావిధి ననుసరింపక పోయినను దెలిసికొనఁ గౌతుకమును బూనియుందురనుటకు సందియములేదు.

కాశీఖండమున నించుమించుగఁ బ్రతియధ్యాయము నను యాత్రాక్రమము సూచింపఁబడియున్నది.

శ్లో. న వన్ధ్యం దివసం కుర్యాద్వినా యాత్రాం క్వచిత్కృతీ.

పుణ్యజనులు యాత్ర సలుపక నొకదినమైనను వ్యర్థ పుచ్చరాదు. అనఁగాశీవాసులు ప్రతినిత్యమును యాత్ర సలుపుచు నుండవలయును. కాశీఖండమందు,

శ్లో. యస్య వన్ధ్యం దినం యాతం కాశ్యాం నివసతః సతః,
నిరాశాః పితర స్తస్య తస్మి న్నేవ దినేఽభవన్.

కాశీవాస మొనర్చువార లేదినమును యాత్రసలుపక వ్యర్థ పుచ్చుదురో యాదినమున వారిపితరులు నిరాశ నొందుదురు. అని చెప్పఁబడియున్నది.

విదేశీయులు కాశియాత్ర కరుదెంచునపుడు శుభ ముహూర్తమున స్వగృహమందు గణేశుని బూజించి, శ్రాద్ధ మొనరించి తచ్ఛేషమును భుజించి కార్పటికవేష మూని యాత్రార్థము యిలు బయలువెడలవలయు. కాశి కరుదెంచిన పిమ్మట స్నానము, ముండనము, ఉపవాసము, శ్రాద్ధము, దానముమొదలగు నవాంతరయాత్రల నాచరింపవలయు. యాత్ర కరుదెంచునపుడు యానము, ఛత్రము, పాదరక్ష మొదలగు సౌకర్యములను శక్త్యనుసరముగ విడువవలయును.

యాత్రాపరులు తమయిష్టమిత్త్రులనుబంధువులను మొదలగువారియాకారములను కుశాగ్రములచే నొనరించి, తదాకారములను స్నానాదికములను జేయించిన వారివారికి అష్టమాంశఫలము లభించును.

శ్లో. వస్తుః కోటిగుణం పుణ్యం కాశ్యాం వాసయితు ర్భవమ్,
ఆత్మానం తారయేద్వస్తా తౌ ద్వౌ వాసయితా యతః.

కాశియందు స్వయముగ వాస మొనరించువారికంటె వాస మొసంగువారికిఁ గోటిగుణము పుణ్య మధికము. ఎట్లన, కాశీవాస మొనరించువారు తాము మాత్రమే తరింతురు. వాస మొసంగువా రన్ననో తాము తరించుటయే గాక తమ తో వాసమొనరించువారినిఁగూడఁ దరింపఁజేయుదురు. ఇవ్విధమున నే యాత్రవిషయమునందును నెలుంగునది.

కాశియందలి మృత్తునైనను గొనిపోవఁ దగదు.

శ్లో. కాశితో మృత్తికాఽన్యత్ర నేతుమిచ్ఛతి యః పుమాన్,
కులం వై పతితం తస్య రౌరవే చాతిభైరవే.

ఎవరు కాశినుండి మృత్తునైనను గొనిపోవ నిచ్ఛగింతురో వారివంశీయులు భయంకరమగు రౌరవమునఁ బతితులగుదురు. ఇదేవిధమున బహుపురాణములలోఁ జెప్పఁబడియున్నది.

యాత్రికులు తమనిత్యనైమిత్తికములను నిర్వర్తించుకొని యథావిధిగ యాత్రను సలుపవలయును. యాత్రసమయములో మౌనమును బూని తమలోఁదాము తమయిష్టదైవములను బ్రార్థించుకొనవలయును. లేదా, "హరహర! మహాదేవ! శంభో! కాశీవిశ్వనాథ! గంగా!" యనువాక్యమునుచ్చైస్స్వరమునఁ బఠియించుచు యాత్ర సలుపవలయును.

## తీర్థయాత్రావివరణము.

శ్లో. యాత్రాద్వయం ప్రయత్నేన కర్తవ్యం ప్రతివాసరమ్,
ఆదౌ స్వర్గతరంగిణ్యాస్తతో విశ్వేశితు ర్ధ్రువమ్.

ప్రతిదినమును బ్రయత్నపూర్వకముగ నీ రెండుయాత్ర లను సలుపవలయును. మునుముందు గంగాస్నానమును, బిమ్మట విశ్వనాథదర్శనపూజనములను నియమాచరణమున నుంచవలయును. ఇయ్యది ప్రధానయాత్ర యని కాశీఖండ మునఁ జెప్పఁబడియున్నది. మఱియుఁ గాశీరహస్యమందు,

శ్లో. చక్రపుష్కరిణీతీర్థే స్నాతవ్యం ప్రతివాసరమ్,
పత్రైః పుష్పైః ఫలై స్తోయైః పూజ్యో విశ్వేశ్వరస్సదా.

ప్రతిదినమును మణికర్ణికాతీర్థమందు స్నానమును, బత్రపుష్ప ఫలజలాదికములతో విశ్వనాథపూజనమును సలుపవలయును అని చెప్పఁబడియున్నది. ఇందుల ఫలమును సనత్కుమార సంహితయందు నీవిధమున వర్ణింపఁబడియున్నది.

శ్లో. స్నాత్వా ముముక్షు ర్మణికర్ణికాయాం
మృడాని గంగాహృదయే త్వదాస్యే,
విశ్వేశ్వరం పశ్యతి యోపి కోపి
శివత్వ మాయాతి పునర్న జన్మ.

మృడానీ! యే ముముక్షులు గంగాహృదయరూపమునను, త్వదాస్యరూపమునను (గౌరీముఖము)నొప్పుమణికర్ణికా తీర్థమున స్నానమొనరించి విశ్వనాథునిసందర్శనమును జేయుదురో, వారు తిరిగి పాంచభౌతికశరీరమును బూనక శివరూపమును బొందుదురు. ఈయాత్రకుఁ గాశీఖండమునందు "ఏకాయతనయాత్ర" యని చెప్పఁబడియున్నది.

శ్లో. దృశ్యో విశ్వేశ్వరో నిత్యం స్నాతవ్యా మణికర్ణికా,

నిత్యమును విశ్వనాథదర్శనమును, మణికర్ణికాస్నానమును సలుపవలయును. ప్రాతఃకాలమణికర్ణికాస్నానముకన్న

మాధ్యాహ్నికస్నానము ఫలవత్తర మైనదని కాశీఖండము నను, లింగపురాణమునను విశేషముగ నుదహరింపఁబడి యున్నది.

శ్లో. ప్రాతః పంచనదీస్నాత్వా మధ్యాహ్నే మణికర్ణికామ్.

ప్రాతఃకాలమున పంచగంగాస్నానమును, మధ్యాహ్నమున మణికర్ణికాస్నానమును సలుపవలయును. శివరహస్యమందు,

శ్లో. ప్రాతర్దశాశ్వమేధే చ మధ్యాహ్నే మణికర్ణికామ్

ప్రాతఃకాలమున దశాశ్వమేధఘట్టమునందును, మధ్యాహ్నమున మణికర్ణికయందును స్నాన మొనరింపవలయును.

కేవలమణికర్ణికాస్నానమునకు నేకతీర్థయాత్ర యనియు, పంచగంగా మణికర్ణికాస్నానములకు ద్వితీర్థయాత్ర యనియు, దశాశ్వమేధపంచగంగామణికర్ణికాస్నానములకుఁ త్రితీర్థ యాత్ర యనియుఁ జెప్పఁబడియున్నది.

లింగపురాణమునందు,

శ్లో. కాశ్యాం తీర్థత్రయీ శ్రేష్ఠా నిత్యం సేవ్యా ప్రయత్నతః,
ఆదౌ స్నాత్వా ప్రయాగే తు పంచగంగా తతః పరమ్,
తతః పుష్కరిణీతీర్థే స్నాత్వా ముచ్యేత బంధనాత్.

కాశియందు మూఁడు తీర్థములు (ఘట్టములు) శ్రేష్ఠములు. ముందు ప్రయాగ (దశాశ్వమేధ), పిమ్మట పంచగంగ, తదనంతరమున మణికర్ణిక. ఈతీర్థములు మూఁటియందును స్నానమొనరించిన భవబంధమునుండి విముక్తి కలుగునని చెప్పఁబడియున్నది.

కాశీదర్పణమందు,

శ్లో. పుణ్యే పిలిపిలాతీర్థే త్రిసరిత్పరిసేవితే,
స్నాత్వా గృహ్యోక్తవిధినా తర్పణీయాన్ప్రతర్ప్య చ.
తతః పంచహ్రదే స్నాత్వా మణికర్ణీహ్రదే తతః,
తతో జ్ఞానోదవాప్యాంతు స్నాత్వా విశ్వేశమర్చయేత్,
ప్రాయశ్చిత్త మిదం ప్రోక్తం మహాపాపవిశోధనమ్.

గంగాయమునాసరస్వతుల సంగమస్థానమును, పుణ్యమయమును నగు పిలిపిలాతీర్థమందు (త్రిలోచనఘాటు) గృహ్యసూత్రాదికముల నొప్పుచొప్పున స్నానమాడి, పితరులకుఁ దర్పణము చేసి పిమ్మటఁ బంచగంగామణికర్ణికలయందును, ననంతరమున జ్ఞానవాపియందును సుస్నాతులై విశ్వేశ్వరుని బూజింపవలయును. ఈచతుస్తీర్థయాత్ర మహాపాతకశోధన ప్రాయశ్చిత్తమై యొప్పుచున్నయది. అని చెప్పఁబడియున్నది. ఇవ్విధముననే కాశీఖండమందును,

శ్లో. ప్రథమం చాపి సంభేదం తీర్థానాం ప్రవరం పరం,
తతో దశాశ్వమేధాఖ్యం సర్వతీర్థనిషేవితమ్.
తతః పాదోదకం తీర్థ మాదికేశవసన్నిధౌ,
తతః పంచనదః పుణ్యః స్నానమాత్రాదఘౌఘహృత్.
ఏతేషా మపి తీర్థానాం చతుర్ణా మపి సత్తమం,
పంచమం మణికర్ణ్యాఖ్యం మనోవాక్కాయశుద్ధిదమ్.
పంచతీర్థ్యాం నరః స్నాత్వా న దేహం పాంచభౌతికమ్,
గృహ్ణాతి జాతుచిత్కాశ్యాం పంచాస్యో వాభిజాయతే.

ప్రప్రథమమున సమస్తతీర్థములలోఁ బరమపవిత్రమగు అసిసంగమందును, బిమ్మట సమస్తతీర్థసేవితమగు దశాశ్వమేధ

మందును, అటుపిమ్మట నాదికేశవసన్నిధి నొప్పు పాదోదక తీర్థమునందును (వరణాసంగమము), అనంతరమున సమస్త పాపసంహారకరమగు పవిత్రతరపంచగంగాతీర్థమందును, ఈ చతుస్తీర్థములయందు నుత్తమమయి పంచమమగు మణికర్ణికా తీర్థమునందును మనోవాక్కాయశుద్ధిదమునకు స్నానమాడ వలయు. ఈపంచతీర్థములయందు స్నానమాడుమనుజుఁ డెన్నఁడును దిరిగి పాంచభౌతికశరీరమును దాల్పఁడు. ఒకపుడు దాల్చిన, సాక్షాత్పంచముఖ శివస్వరూపమును దాల్చును. ఈపంచతీర్థయాత్ర విశేషప్రచురితము. అందుఁ బర్వములయందతివిశేషము. ఈయాత్రయందే కేదారఘట్టమందలి గౌరీ కుండమునందును, త్రిలోచనఘట్టమందలి పిలిపిలాతీర్థమందును స్నానమొనరించిన సప్తతీర్థయాత్రయగును.

## ఆయతనయాత్రావివరణము

ఏకాయతనయాత్ర:— గంగామణికర్ణికేత్యాది తీర్థములయందు స్నానమాడి విశ్వేశ్వరునిదర్శనపూజనము లొనరించినయాత్రకు నేకాయతనయాత్ర యనునామము సుప్రసిద్ధము. ఇందుల ప్రమాణములు పూర్వముననే వివరింపఁబడి యున్నవి.

ద్వ్యాయతనయాత్ర:—నందికేశ్వరపురాణమందు,

శ్లో. మణికర్ణ్యాంనరస్స్నాత్వా మణికర్ణీశమర్చయేత్,
తతో వాప్యాం నరస్స్నాత్వా విశ్వేశం పూజయేత్తు యః,
సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మభూయాయ కల్పతే.

మణికర్ణికయందు స్నానముచేసి మణికర్ణికేశ్వరుని జ్ఞానవాపియందు స్నానము సలిపి విశ్వేశ్వరుని పూజించుమానవులు

సర్వపాపవిముక్తులై బ్రహ్మస్వరూపమును బడయుదురు. అని చెప్పఁబడియున్నది. ఇయ్యది ద్వ్యాయతనయాత్ర యని ప్రసిద్ధము.

త్ర్యాయతనయాత్ర:—లింగపురాణమందు,

శ్లో. అవిముక్తం చ స్వర్లీనం తథా మధ్యమకం పదమ్,
ఏతల్లింగ త్రయం దేవి! దృష్ట్వా పాపాని సంక్షయతి.

దేవీ! అవిముక్తేశ్వర, స్వర్లీనేశ్వర, మధ్యమేశ్వరలింగములను దర్శించిన సమస్తపాపములు నశించును. అని చెప్పఁబడియున్నది. ఇయ్యది త్ర్యాయతనయాత్ర.

చతురాయతనయాత్ర:—లింగపురాణముననే

శ్లో. శైలేశం సంగమేశం చ స్వర్లీనం మధ్యమేశ్వరం,
దృష్ట్వా న జాయతే మర్త్యః సంసారే దుఃఖసాగరే.

శైలేశ్వర, సంగమేశ్వర, స్వర్లీనేశ్వర, మధ్యమేశ్వర లింగములను దర్శనముచేసిన, దుఃఖసాగరరూప మగుసంసారమును దిరిగి గనుఁగొనరు. అని చెప్పఁబడియున్నది. ఇది చతురాయతనయాత్ర.

పంచాయతనయాత్ర:—లింగపురాణముననే

శ్లో. కృత్తివాసా మధ్యమేశ ఓంకారశ్చ కపర్దికః,
విశ్వేశ్వర ఇతి జ్ఞేయం పంచాయతన ముత్తమమ్.

కృత్తివాసేశ్వర, మధ్యమేశ్వర, ఓంకారేశ్వర, కపర్దీశ్వర, విశ్వేశ్వరలింగములను దర్శనముచేసిన నుత్తమమగు పంచాయతనయాత్ర యని చెప్పఁబడియున్నది. ఇందుఁ గేదారేశ్వర త్రిలోచనేశ్వరులను గూడ దర్శన మొనరించిన సప్తాయ

తనయాత్ర యనఁబడును. పంచతీర్థ పంచాయతనయాత్రలకుఁ దిథ్యాదికనియమవిశేషములు చెప్పియుండనందున నిరంతరమాయాత్ర లాచరణమునందుఁ బ్రచురితములై యొప్పుచున్నయవి.

## పంచక్రోశయాత్ర

పంచక్రోశయాత్ర సలుపు యాత్రార్థులు పూర్వదివసమున గంగాస్నానమును నిత్యయాత్రయు సలిపి ముక్తిమండపమున కరిగి సంకల్పపూర్వకముగ ఢుంఠివినాయకుని బూజింపవలయును. సావకాశమగునెడ నాదివసముననే యంతర్గృహయాత్రసలుపవలయును. ఆదినమున నేకభుక్త మొనరించి మరుసటిదినమున స్నానాదినిత్యనైమిత్తికముల సమాప్త మొనరించి ముక్తిమండపమున కరిగి "మానసిక వాచిక కాయిక జ్ఞానాజ్ఞాన సమస్తపాపపరిహారార్థం, ధర్మార్థకామమోక్షచతుర్విధఫలలాభార్థం, పంచక్రోశాత్మకజ్యోతిర్లింగస్వరూప శ్రీవిశ్వేశ్వరఅన్నపూర్ణ లక్ష్మీనారాయణ ఢుండిరాజాది ఛప్పన్నవినాయకద్వాదశాదిత్య నృసింహ కేశవ రామకృష్ణ మత్స్యకూర్మాది దశావతారసంశోభిత శ్రీమహావిష్ణు అనేకశివగౌర్యాదిదేవతాపరిపూర్ణశ్రీకాశీక్షేత్రప్రదక్షిణమహంకరిష్యే" యని సంకల్పించి విశ్వేశ్వరుని సన్నిధి కరిగి,

శ్లో. పంచక్రోశస్య యాత్రాం వై కరిష్యే విధిపూర్వకం,
ప్రీత్యర్థం తవ దేవేశ సర్వాఘౌఘప్రశాన్తయే.

దేవేశా! నీప్రసన్నతకొఱకును, సమస్తపాపప్రశాంతికొఱకును విధిపూర్వకము పంచక్రోశయాత్రసలుపఁ బోవు

చున్నాను. అని విన్నవించి మౌనవ్రత మూని డుండిరాజును బూజించి,

శ్లో. డుండిరాజ! గణేశాన! మహావిఘ్నౌఘనాశన,
పంచక్రోశస్య యాత్రార్థం దేహ్యాజ్ఞాం కృపయా విభో.

డుండిరాజా! గణేశానా! మహావిఘ్నములను బాపములను నాశనమొనరించువాఁడా! నీవు నాయందుఁ గృపాళుఁడవై పంచక్రోశయాత్ర సలుప ననుజ్ఞనొసఁగుము. అని ప్రార్థన మొనరించి విశ్వేశ్వరునకుఁ బ్రదక్షిణపూర్వకముగ ముమ్మారు సాంగ నమస్కృతు లొనర్చి మోద ప్రమోదసుముఖ దుర్ముఖ గణనాథ వినాయకులను దండపాణి కాలభైరవులను బూజించి మణికర్ణిక కరిగి యందు స్నాన మొనరించి యాత్రాపరిక్రమమున నొప్పవలయును. మార్గమధ్యమున నెలకొని యున్న సమస్తదేవతలను దర్శనము సేయుచు యథాసంభవముగఁ బూజ సలుపుట యుక్తము.

## ప్ర థ మ ది వ స ము

| దేవతానామములు. | స్థానములు. |
|---|---|
| మణికర్ణి కేశ్వరుఁడు | మణికర్ణి కాఘట్టము |
| సిద్ధివినాయకుఁడు | ,, |
| గంగాకేశవుఁడు | లలితాఘాటు |
| లలితాదేవి | ,, |
| జరాసంధేశ్వరుఁడు | మీరుఘాటు |
| సోమనాథుఁడు | మానమందిరఘాటు |
| దాలభ్యేశ్వరుఁడు | ,, |

| దేవతానామములు. | స్థానములు. |
|---|---|
| శూలటంకేశ్వరుఁడు | దశాశ్వమేథఘాటు |
| ఆదివరాహేశ్వరుఁడు | ,, |
| దశాశ్వమేధేశ్వరుఁడు | ,, శీతలామందిరము |
| వన్దిదేవి | ,, ప్రయాగేశ్వరు మందిరము |
| సర్వేశ్వరుఁడు | పాండేఘాటుసమీపము |
| కేదారేశ్వరుఁడు | కేదార్ ఘాటు |
| హనుమదీశ్వరుఁడు | హనుమాన్ ఘాటు |
| సంగమేశ్వరుఁడు | అసీసంగమము |
| అర్కవినాయకుఁడు | లోలార్కము |
| లోలార్కము | భదైని |
| దుర్గాకుండము | దుర్గసమీపము |
| దుర్గవినాయకుఁడు | దుర్గసమీపము |
| దుర్గాదేవి | ,, ప్రసిద్ధము |

(ఇందు బ్రాహ్మణులకు పాయసభక్ష్యముల నొసంగవలయు)

శ్లో. జయ దుర్గే మహాదేవి! జయ కాశీనివాసిని,
క్షేత్ర విఘ్నహరే! దేవి! పునర్దర్శన మస్తు తే.

అని ప్రార్థించి పయనము సాగింపవలయును.

| | |
|---|---|
| విష్వక్సేనేశ్వరుఁడు | కరమైతాపురము |
| కర్దమేశ్వరుఁడు | కందవాగ్రామము |

(ఇందు అక్షతలు తిలలు చల్లవలయును).

| | |
|---|---|
| కర్దమతీర్థము | ,, |
| కర్దమకూపము | ,, |

(ఇందు ముఖమును జూచుకొనవలయు).

| దేవతానామములు. | స్థానములు. |
|---|---|
| సోమనాథుఁడు | కందవాగ్రామము |
| విరూపాక్షుఁడు | ,, |
| నీలకంఠేశ్వరుఁడు | ,, |

(ఇందు ప్రథమదివసమున నివసింపవలయు).

శ్లో. కర్దమేశ! మహాదేవ! కాశీవాస జనప్రియ,
త్వత్పూజనా న్మహాదేవ! పున ర్దర్శనమస్తు తే.

అని కర్దమేశ్వరుని బ్రార్థింపవలయు.

## రెండవదివసము

| | |
|---|---|
| నాగనాథుఁడు | అమరాగ్రామము |
| చాముండాదేవి | అవడేగ్రామము |
| మోక్షేశ్వరుఁడు | ,, |
| కరుణేశ్వరుఁడు | ,, |
| వీరభద్రేశ్వరుఁడు | దెలహానాగ్రామము |
| వికటదుర్గా | ,, |
| ఉన్మత్తభైరవుఁడు | దేవురాగ్రామము |
| నీలగణనాథుఁడు | ,, |
| కాలకూటగణనాథుఁడు | ,, |
| విమలాదుర్గా | ,, |
| మహాదేవుఁడు | ,, |
| నందికేశ్వరుఁడు | ,, |
| భృంగిరిటగణనాథుఁడు | ,, |
| గణప్రియుఁడు | ,, |

| దేవతానామములు. | స్థానములు. |
| --- | --- |
| విరూపాక్షుఁడు | గౌరా గ్రామము |
| యక్షేశ్వరుఁడు | చక్కమాతలదేయి |
| విమలేశ్వరుఁడు | ప్రయాగపురము |
| మోక్షదేశ్వరుఁడు | ,, |
| జ్ఞానదేశ్వరుఁడు | ,, |
| అమృతేశ్వరుఁడు | అసవారీ గ్రామము |
| గంధర్వసాగరము | భీమచండీ గ్రామము |
| | వాలాపోఖరా యని ప్రసిద్ధము. |
| భీమచండీదేవి | భీమచండీ గ్రామము |
| భీమచండవినాయకుఁడు | ,, |
| రవిరక్తాక్షగంధర్వుఁడు | ,, |
| నరకార్ణవతారణశివుఁడు | ,, |

ఇందు ద్వితీయనివాసము.

శ్లో. భీమచణ్డి ప్రచణ్డాని మమ విఘ్నాని నాశయ,
నమస్తేస్తు గమిష్యామి పునర్దర్శన మస్తు తే.

అని భీమచండీదేవిని బ్రార్థింపవలయు.

## మూఁడవ దినము

| | |
| --- | --- |
| ఏకపాదగణనాథుఁడు | కచనార గ్రామము |
| మహాభీముఁడు | హరపుర గ్రామము |
| భైరవనాథుఁడు | హరసోస గ్రామము |
| భైరవదేవి | ,, |

| దేవతానామములు. | స్థానములు. |
|---|---|
| భూతనాథేశ్వరుఁడు | దీనదాసపురము |
| సోమనాథేశ్వరుఁడు | ,, |
| సింధురోధసతీర్థము | ,, |
| కాలనాథుఁడు | జనసాగ్రామము |
| కపర్దీశ్వరుఁడు | ,, |
| కామేశ్వరుఁడు | చౌఖండీగ్రామము |
| గణేశ్వరుఁడు | ,, |
| వీరభద్రగణనాథుఁడు | ,, |
| చారుముఖగణనాథుఁడు | ,, |
| గణనాథేశ్వరుఁడు | భటౌలీగ్రామము |
| దేహాలీవినాయకుఁడు | ,, |
| షోడశవినాయకులు | ,, |
| ఉద్దండవినాయకుఁడు | భుయిలీగ్రామము |
| ఉత్కలేశ్వరుఁడు | హిరామపురగ్రామము |
| రుద్రాణీదేవి | ,, |
| తపోభూమి | ,, |

రుద్రాణీదేవి తప మొనర్చినతావు.

వరుణానది రామేశ్వరము. (ఇందు స్నానము తర్పణము

| | |
|---|---|
| రామేశ్వరుఁడు | ,,[ముఖ్యము). |
| సోమేశ్వరుఁడు | రామేశ్వరము |
| భరతేశ్వరుఁడు | ,, |
| లక్ష్మణేశ్వరుఁడు | ,, |
| శత్రుఘ్నేశ్వరుఁడు | ,, |

| దేవనామములు | స్థానములు |
| --- | --- |
| ద్యావాభూమీశ్వరుఁడు | రామేశ్వరము. |
| నహుషేశ్వరుఁడు | ,, |

ఇందుఁ దృతీయనివాసము.

రామేశ్వరుని శ్వేతతిలలతోను బిల్వదళములతోను బూజించుచు

శ్లో. శ్రీరామేశ్వర రామేణ పూజిత స్త్వం సనాతన!,
ఆజ్ఞాం దేహి మహాదేవ! పున ర్దర్శన మస్తు తే.

అని ప్రార్థింపవలయును.

## నాలవదినము

| | |
| --- | --- |
| అసంఖ్యాకతీర్థలింగములు | వరుణాతీరము |
| దేవసంఘేశ్వరుఁడు | కరోమాగ్రామము |
| ద్రౌపదీకుండము | ,, |
| ధర్మేశ్వరుఁడు | ,, |
| భీమేశ్వరుఁడు | ,, |
| అర్జునేశ్వరుఁడు | ,, |
| నకులేశ్వరుఁడు | ,, |
| సహదేవేశ్వరుఁడు | ,, |
| పాశపాణిగణేశ్వరుఁడు | సదర్ బజారు |
| పృథివీశ్వరుఁడు | ఖజురీగ్రామము |
| స్వర్గభూమి | ,, |
| సారంగసరోవరము | ,, |

| దేవనామములు | స్థానములు |
| --- | --- |
| యూపసరోవరము | దీనదయాళుపురము |
| కపిలధారాతీర్థము | కపిలధారగ్రామము |
| వృషభధ్వజేశ్వరుఁడు | ,, |

శ్లో. వృషభధ్వజ! దేవేశ! పితౄణాం ముక్తిదాయక!,
ఆజ్ఞాం దేహి మహాదేవ! పునర్దర్శన మస్తు తే.

అని ప్రార్థింపవలయును.

కపిలధార పితరులకు గయాక్షేత్రమువలె మిగులఁ బ్రియకరమగు స్థానము. అందువలన నిది "శివగయ" యని ప్రసిద్ధము. ఇందుఁ దర్పణము, శ్రాద్ధము, బ్రాహ్మణభోజనము మొదలగునవి జరుపవలయును. ఇది చతుర్థనివాసము.

## అయిదవదినము

| | |
| --- | --- |
| జ్వాలానృసింహుఁడు | కటోవా గ్రామము |
| వరుణాసంగమము | ప్యాట్ హేకోట (ఇందు స్నానము లేక మార్జనము సేయవలయును). |
| ఆదికేశవుఁడు | వరుణాసంగమము |
| సంగమేశ్వరుఁడు | ఆదికేశవమందిరము |
| ఖర్వవినాయకుఁడు | ప్యాట్ హేకోట |
| ప్రహ్లాదేశ్వరుఁడు | ప్రహ్లాదఘాటు |
| త్రిలోచనమహాదేవుఁడు | త్రిలోచనఘాటు |
| పంచగంగాతీర్థము | పంచగంగాఘాటు |
| బిందుమాధవుఁడు | ప్రసిద్ధము |

| దేవనామములు | స్థానములు |
| --- | --- |
| గభస్తీశ్వరుఁడు | ప్రసిద్ధము |
| మంగళగౌరి | " |
| వసిష్ఠేశ్వరుఁడు | సంకటాఘాటు |
| వామదేవేశ్వరుఁడు | " |
| పర్వతేశ్వరుఁడు | ఆత్మావీరేశ్వరమందిరము |
| మహేశ్వరుఁడు | మణికర్ణికాఘాటు |
| సిద్ధివినాయకుఁడు | " |
| సప్తావరణవినాయకుఁడు లేక, జవవినాయకుఁడు | ప్రసిద్ధము |
| మణికర్ణికామహాతీర్థము. | " |

ఇందు స్నానమొనరించి విశ్వేశ్వరునిమందిరమున కరిగి విధ్యుక్తముగ విశ్వనాథునిఁ బూజించి సాష్టాంగనమస్కృతులొనర్చి ముక్తిమండపమున కరుగవలయు. పిమ్మట అన్నపూర్ణ, విష్ణు, దండపాణి, ఢుండిరాజు, భైరవాదిత్యులను మోదాది పంచవినాయకులను బూజించి విశ్వేశ్వరుని సన్నిధికరిగి,

శ్లో. జయ విశ్వేశ! విశ్వాత్మన్! కాశీనాథ! జగద్గురో!,
త్వత్ప్రసాదా న్మహాదేవ! కృతా క్షేత్రప్రదక్షిణా.
అనేకజన్మపాపాని, కృతాని మమ శంకర!,
గతాని పంచక్రోశాత్మలింగస్యాస్య ప్రదక్షిణాత్.
త్వద్భక్తికాశీవాసాభ్యాం సహైవాஉపాపకర్మణా,
సత్సంగశ్రవణాద్యైశ్చ కాలో గచ్ఛతు న స్సదా.
హర! శంభో! మహాదేవ! సర్వజ్ఞ! సుఖదాయక!,

ప్రాయశ్చిత్తం సునిర్వృత్తం పాపానాం త్వత్ప్రసాదతః,
పునః పాపరతి ర్మాస్తు ధర్మబుద్ధి స్సదాఽస్తు మే.

కాశీనాథ! జగద్గురూ! విశ్వాత్మా! విశ్వేశ్వరా! జయ! మహాదేవా! నీప్రసాదమువలన నేను గాశీక్షేత్రమునకుఁ బ్రదక్షిణ మొనర్చితిని. శంకరా! అనేకజన్మాంతరములనుండి నే నొనర్చినపాపపుంజము లీ పంచక్రోశాత్మకజ్యోతిర్లింగ ప్రదక్షిణమువలన క్షయము లయ్యెను. నీయందలిభక్తియుఁ, గాశీవాసమును, బాపరాజ్ముఖత్వమును, సత్సంగత్వమునఁ బురాణశ్రవణము మొదలగుసత్కర్మములతోఁ గాలముగడుపునటుల నాకు వరదాన మొసంగుము. హరా! శంభూ! మహాదేవా! సర్వజ్ఞ! సుఖదాయకా! నీప్రసాదమువలన నాపాపనిర్వృత్తికిఁ బ్రాయశ్చిత్త మలవడెను. ఇఁక ముందు పాపకర్మములందు నాబుద్ధి ప్రసరింపకుండ నిరంతరము ధర్మపథమునఁ బ్రవర్తించునటుల ప్రసాదింపుము.

శ్లో. పంచక్రోశస్య యాత్రేయం యథావద్యా మయా కృతా,
న్యూనం సంపూర్ణతాం యాతు త్వత్ప్రసాదాదుమాపతే.

ఉమాపతీ! యథాశక్తిగ నే నొనర్చినయీపంచక్రోశయాత్రయందు లోపములున్నయెడల నయ్యవి నీయనుగ్రహమున సంపూర్ణమునొందవలయును. అని ప్రార్థించి గృహంబున కరిగి యథాశక్తిగ బ్రాహ్మణులకు భోజనమిడి దక్షిణతాంబూలములం బరితృప్తులం జేయవలయు. ఇవ్విధముగఁ బంచక్రోశయాత్ర సాధారణముగ నాస్వల్పబుద్ధిని, గాశీరహస్య కాశీదర్పణాదిగ్రంథముల యాధారమున సంక్షేపముగ వ్రాసితిని.

విశేషమును యాత్రికులు స్వయముగ విచారణ సలుపవల యును. ఈయాత్రనుగూర్చి, దేవస్థానములను తదీయమాహాత్మ్యములను విశేషముగ వర్ణింపఁబడియున్నను గాశీరహస్యమునఁ జెప్పఁబడినవిధమునఁ గాశీఖండమున విశేషముగఁ జెప్పియుండలేదు. ఈయాత్ర శరీరశుద్ధికొఱకై కాశియందలి సమస్తయాత్రలలో సర్వప్రధానముగ నెన్నఁబడుచున్నయది. నారదీయపురాణమునందు నీయాత్రఫలము నివ్విధముగ

శ్లో. కాశీప్రదక్షిణా యేన కృతా త్రైలోక్యపావనీ,
సప్తద్వీపా సాబ్ధిశైలా కృతా తేన ప్రదక్షిణా.

త్రైలోక్యపావని యగు కాశీపురప్రదక్షిణమున సముద్ర పర్వతసహిత సప్తద్వీపభూమండలమును ప్రదక్షిణమొనరించిన లభించుఫలము లభించును.

## అంతర్గృహ యాత్ర

ప్రాతఃకాలమున గంగాస్నాన మొనరించి మోద, ప్రమోద, దుర్ముఖ, సుముఖ, గణనాయకులను పంచవినాయకులకు సభక్తికముగ నమస్కరించి ముక్తిమండపమున కరిగి విశ్వేశ్వరునకు దండప్రణామము లొసంగి, సమస్తపాపప్రాయశ్చిత్తార్థము, అంతర్గృహయాత్ర సలుపఁబోవుచున్నాఁడ నని సంకల్పించి మౌనవ్రత మవలంబించి మణికర్ణిక కరుగవలయు. అందు స్నానము చేసి మణికర్ణికేశ్వరుని దర్శనార్చన లొనరించి యాత్రాపరక్రమమున నొప్పవలయు. ఈయాత్రయందలి దర్శనీయములగు స్థానములు:—

| దేవనామములు | స్థానములు |
|---|---|
| మణికర్ణికాతీర్థము | ప్రసిద్ధము |
| మణికర్ణికేశ్వరుఁడు | గోమఠసామీప్యము వర్ధవాన్ మందిరమున |
| సిద్ధివినాయకుఁడు | ,, |
| కంబలాశ్వతరేశ్వరుఁడు | ,, |
| వాసుకీశ్వరుఁడు | సంకటాఘాటు |
| పర్వతేశ్వరుఁడు | సంకటాఘాటు |
| గంగాకేశవుఁడు | లలితాఘాటు |
| లలితాదేవి | ,, |
| జరాసంధేశ్వరుఁడు | మీరుఘాటు |
| సోమనాథుఁడు | మానమందిరఘాటు |
| ఆదివరాహేశ్వరుఁడు | ,, |
| దాలభ్యేశ్వరుఁడు | ,, |
| బ్రహ్మేశ్వరుఁడు | బాలముకుందు చౌహట్టా |
| అగస్త్యేశ్వరుఁడు | అగస్త్యకుండము గోదారియా. |
| కశ్యపేశ్వరుఁడు | జంగమబాడీ |
| హరికేశవనేశ్వరుఁడు | ,, |
| వైద్యేశ్వరుఁడు, వైద్యనాథుఁడు | కోదయీచౌకి |
| ధ్రువేశ్వరుఁడు | ప్రసిద్ధము |
| గోకర్ణేశ్వరుఁడు | కోదయీచౌకి |
| హాటకేశ్వరుఁడు | హాడహా (ప్రాచీనస్థానము గుప్తము) |

| దేవనామములు | స్థానములు |
|---|---|
| హస్తిక్షేపతటాకము | ,, (ప్రవాహమున లుప్తము) |
| కీకసేశ్వరుఁడు | రాజదర్వాజా |
| భారభూతేశ్వరుఁడు | గోవిందపురా |
| చిత్రగుప్తేశ్వరుఁడు | మఛర్ హట్టా |
| చిత్రఘంటాదేవి | చౌకు. చన్దూకీ గల్లీ |
| పాశుపతీశ్వరుఁడు | ప్రసిద్ధము |
| పితామహేశ్వరుఁడు | శీతలాగల్లీ. (చీకటికోణములో నుండుకతన శివరాత్రియందు మాత్రము దర్శనమలవడును) |
| కలశేశ్వరుఁడు | కలశేశ్వర బ్రహ్మపురము |
| చంద్రేశ్వరుఁడు | సిద్ధేశ్వరీమందిరము. చంద్రకూపసామీప్యము. |
| వీరేశ్వరుఁడు | వీరతీర్థము ఆత్మావీరేశ్వరుఁడని ప్రసిద్ధము. |
| విద్యేశ్వరుఁడు | నీమ్‌వాలీ బ్రహ్మపురి |
| అగ్నీశ్వరుఁడు | అగ్నీశ్వరఘాటు (ఉపశాంతశివునిమందిరసామీప్యమున.) |
| నాగేశ్వరుఁడు | భోంసలాఘాటు |
| హరిశ్చంద్రేశ్వరుఁడు | సంకటాఘాటు |
| చింతామణివినాయకుఁడు | ,, |
| సేనావినాయకుఁడు | ,, |
| వసిష్ఠేశ్వరుఁడు | ,, |

| దేవనామములు | స్థానములు |
| --- | --- |
| వామదేవేశ్వరుఁడు | సంకటాఘాటు |
| సీమావినాయకుఁడు | ,, |
| కరుణేశ్వరుఁడు | లహారీటోలా |
| త్రిసంధ్యేశ్వరుఁడు | ,, |
| విశాలాక్షి | ,, ప్రసిద్ధము |
| ధర్మేశ్వరుఁడు | ప్రసిద్ధము<br>ధర్మకూపసామీప్యము. |
| విశ్వభుజాదేవి | ప్రసిద్ధము |
| ఆశావినాయకుఁడు | మీరుఘాటు |
| వృద్ధాదిత్యుఁడు | ,, |
| చతుర్వక్త్రేశ్వరుఁడు | సకరకందకీ గల్లీ |
| బ్రాహ్మీశ్వరుఁడు | ,, |
| మనఃప్రకామేశ్వరుఁడు | సాక్షివినాయకసమీపము |
| ఈశానేశ్వరుఁడు | కొత్వాల్ పురా |
| చండికాదేవి | కాలికాగల్లీ |
| చండీశ్వరుఁడు | ,, |
| భవానీశంకరుఁడు | ,,<br>శుక్రకూపసామీప్యము. |
| అన్నపూర్ణాదేవి | ప్రసిద్ధము |
| ఢుండిరాజగణేశ్వరుఁడు | ,, |
| రాజరాజేశ్వరుఁడు | జవవినాయకసామీప్యము |
| లాంగలీశ్వరుఁడు | ఖోవాబజారు |

| దేవనామములు | స్థానములు |
|---|---|
| నకులీశ్వరుఁడు | విశ్వేశ్వరమందిరమున హనుమాన్ జీ వెనుకభాగము. |
| పరాన్నేశ్వరుఁడు | దండపాణిసామీప్యము జ్ఞానవాపి వెనుకభాగము. |
| పరద్రవ్యేశ్వరుఁడు | దండపాణిసామీప్యము |
| ప్రతిగ్రహేశ్వరుఁడు | ,, |
| నిష్కలంకేశ్వరుఁడు | ,, |
| మార్కండేయేశ్వరుఁడు | ,, |
| అప్సరేశ్వరుఁడు | ,, ఉత్తరద్వారసమీపము. |
| గంగేశ్వరుఁడు | మశీదుసామీప్యము అశ్వత్థవృక్షమూలము (మూర్తిగుప్తము.) |
| జ్ఞానవాపి | ప్రసిద్ధము |
| నందికేశ్వరుఁడు | జ్ఞానవాపీసామీప్యము |
| తారకేశ్వరుఁడు | గౌరీశంకరమూర్తికి దిగువభాగము. |
| మహాకాళేశ్వరుఁడు | ప్రసిద్ధము |
| దండపాణి | జ్ఞానవాపికి పశ్చిమభాగము ప్రసిద్ధము. |
| మహేశ్వరుఁడు | జ్ఞానవాపికి నైఋతికోణము అశ్వత్థవృక్షమూలము |
| మోక్షేశ్వరుఁడు | ,, ,, |
| వీరభద్రేశ్వరుఁడు | జ్ఞానవాపికి వాయుకోణము |

| దేవనామములు | స్థానములు |
| --- | --- |
| అవిముక్తేశ్వరుఁడు | విశ్వేశ్వరమందిరము, ప్రాచీనస్థానము జ్ఞానవాపికి ఉత్తరద్వారము. |
| మోదాదిపంచవినాయకులు | జ్ఞానవాపీసమీపము |
| శ్రీవిశ్వేశ్వరుఁడు | ప్రసిద్ధము |

విశ్వేశ్వరునిదర్శనపూజనము లొనరించి మౌనవ్రతమును వీడి

శ్లో. అంతర్గృహస్య యాత్రేయం యథావద్యా మయా కృతా,
న్యూనాతిరిక్తయా శంభుః ప్రీయతా మనయా విభుః.

అని ప్రార్థనము సలిపి ముక్తిమండపమున కరిగి విశ్రామ మొంది గృహంబున కరుగవలయు. సాధ్యమగునెడ, శక్త్యనుసారము బ్రాహ్మణులను, భోజనదక్షిణ తాంబూలాదు లొసంగి తృప్తిపఱచవలయు.

## సప్తర్షియాత్ర

| | |
| --- | --- |
| కశ్యపేశ్వరుఁడు | జంగమబాడీ, ఈలింగమునకు కాశీఖండమున ఆంగిరసేశ్వరుఁ డనియున్నది. |
| అత్రీశ్వరుఁడు | కోదయీకీచౌకీ గోకర్ణేశ్వరసమీపము. |
| మరీచీశ్వరుఁడు | నాగకుండము లేక, నాగకుంవా. |
| గౌతమేశ్వరుఁడు | గోదౌలియా, శ్రీకాశీ మహారాజావారి శివాలయసామీప్యము. కాశీఖండమున క్రత్వీశ్వరుఁడని యున్నది. |
| పులహేశ్వరుఁడు | మణికర్ణిక, స్వర్గద్వారమునకు పశ్చిమభాగము. |

| దేవనామములు | స్థానములు |
| --- | --- |
| పులస్త్యేశ్వరుఁడు | మణికర్ణిక, స్వర్గద్వారమునకు పశ్చిమభాగము. |
| వసిష్ఠేశ్వరుఁడు | సంకటాఘాటు ఇచ్చటనే |

అరుంధతీశ్వరుని దర్శనము చేయవలయును.

కాశీఖండమందు వరుణాతీరమని వ్రాయఁబడియున్నది.

ఈయాత్ర యవశ్యకర్తవ్యమని కాశీఖండమున వ్రాయఁబడియున్నది.

## అష్టాయతనయాత్ర

| | |
| --- | --- |
| దక్షేశ్వరుఁడు | వృద్ధకాలకూపమునకు ఉత్తరభాగము. |
| పార్వతీశ్వరుఁడు | త్రిలోచనఘాటు ఆదిమహాదేవుమందిరము. |
| పశుపతీశ్వరుఁడు | ప్రసిద్ధము |
| గంగేశ్వరుఁడు | జ్ఞానవాపికి పూర్వభాగము, అశ్వత్థవృక్షమూలము మూర్తిగుప్తము. |
| నర్మదేశ్వరుఁడు | త్రిలోచనమందిరమునకు పూర్వభాగము. |
| గభస్తీశ్వరుఁడు | మంగళగౌరీసమీపము |
| సతీశ్వరుఁడు | వృద్ధకాలషడక్ రత్నేశ్వర సమీపము. |
| తారకేశ్వరుఁడు | జ్ఞానవాపికి పూర్వభాగము మూర్తిగుప్తము. |

| దేవనామములు | స్థానములు |
|---|---|

## అష్టభైరవయాత్ర

| | |
|---|---|
| రురుభైరవుఁడు | హనుమాన్‌ఘాటు |
| చండభైరవుఁడు | దుర్గాకుండము |
| అసితాంగభైరవుఁడు | వృద్ధకాలము అమృతకుండమునకు పూర్వభాగము. |
| కపాలభైరవుఁడు(లాటభైరవుఁడు) ప్రసిద్ధము | |
| క్రోధభైరవుఁడు, లేక, వటుకభైరవుఁడు | కామాచ్ఛా |
| ఉన్మత్తభైరవుఁడు | దేవరాగ్రామము భీమచండిపడక్. |
| సంహారభైరవుఁడు | త్రిలోచనగంజ్ |
| భీషణభైరవుఁడు (భూతభైరవుఁడు) ప్రసిద్ధము | |

ఈయష్టభైరవుల కధినాథుఁడు కాలభైరవుఁడు. ఇవిగాక రామఘాటునకు సమీపమున ఆనందభైరవుఁడును, చౌకుసమీపమున మోహనభైరవుఁడును, విశ్వనాథమందిరమునకు పశ్చిమద్వారసమీపమున ద్వారభైరవుఁడును ప్రసిద్ధములు.

## నవగౌరీయాత్ర

| | |
|---|---|
| ముఖనిర్మాలికాగౌరి | హనుమాన్‌ఘాటు |
| జ్యేష్ఠాగౌరి | కర్ణఘంటామహాలు |
| సౌభాగ్యగౌరి | విశ్వనాథమందిరములో వాయుకోణమున పార్వతియని ప్రసిద్ధము. |

| దేవనామములు | స్థానములు |
|---|---|
| శృంగారగౌరి | విశ్వనాథమందిరములో ఈశానకోణమున అన్నపూర్ణ యని ప్రసిద్ధము. |
| విశాలాక్షీగౌరి | ప్రసిద్ధము |
| లలితాగౌరి | లలితాఘాటు |
| భవానీగౌరి | కాళికాగల్లి, శుక్రేశ్వరసమీపము. |
| మంగళగౌరి | ప్రసిద్ధము |
| మహాలక్ష్మీగౌరి | ,, |

## నవదుర్గాయాత్ర

| | |
|---|---|
| శైలపుత్రీదుర్గా | వరుణాతటము శైలేశ్వరమందిరము |
| బ్రహ్మచారిణీదుర్గా | దుర్గాఘాటు పంచగంగాసమీపము. |
| చిత్రఘంటాదుర్గా | చౌకునకుపూర్వభాగము. చన్దూగల్లి. |
| కూష్మాండదుర్గా (దుర్గా) | దుర్గాకుండము ప్రసిద్ధము |
| స్కందమాతాదుర్గా (వాగీశ్వరి) | జైతుపురము |
| కాత్యాయనీదుర్గా | ఆత్మావీరేశ్వరమందిరము |
| కాలరాత్రీదుర్గా (కాలీ) | కాళీగల్లి |
| మహాగౌరీదుర్గా (అన్నపూర్ణ) | ప్రసిద్ధము |
| సిద్ధిధాత్రీదుర్గా | బుల్లానాలామహాలు. |

| దేవనామములు | స్థానములు |
|---|---|

## దశాయతనయాత్ర లేక నిత్యయాత్ర

శ్లో. విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణిం చ భైరవమ్,
వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్.

ఈయాత్ర బహుప్రచురితము. ఇందలి స్థానముల వివరణ మనావశ్యకము.

## ఏకాదశమహారుద్రయాత్ర.

| | |
|---|---|
| అగ్నిధ్రేశ్వరుఁడు (జాగరేశ్వరుఁడు) | ఇసర్ గంజి |
| ఊర్వశీశ్వరుఁడు | ఔసానగంజి,గోలాబాగ్ |
| నకులేశ్వరుఁడు | విశ్వనాథసామీప్యము మహావీరమందిరమున అక్షయవటమూలము. |
| ఆషాఢీశ్వరుఁడు | కాశీపురా |
| భారభూతేశ్వరుఁడు | గోవిందపురా రాజ దర్వాజా |
| లాంగలీశ్వరుఁడు | ఖోవాజజూరు |
| త్రిపురాంతకేశ్వరుఁడు | సిగ్రా |
| మనఃప్రకామేశ్వరుఁడు | సాక్షివినాయకసామీప్యము. |
| ప్రీతికేశ్వరుఁడు | కాలీగల్లి |
| మదాలసేశ్వరుఁడు | ,, |
| తిలపర్ణేశ్వరుఁడు | దుర్గాకుండము |

## ద్వాదశాదిత్యయాత్ర

| | |
|---|---|
| లోలార్కుఁడు | భదైని, లోలార్కకుండము |
| ఉత్తరార్కుఁడు | ఆలయీపురా |

| దేవనామములు | స్థానములు |
|---|---|
| సాంబాదిత్యుఁడు | సూర్యకుండము |
| ద్రౌపదాదిత్యుఁడు | విశ్వనాథమందిరసామీప్యమున అక్షయవటమూలము. |
| మయూఖాదిత్యుఁడు | మంగళగౌరిసమీపము |
| ఖఖోల్కాదిత్యుఁడు(వినతాదిత్యుఁడు) | త్రిలోచనఘాటు కామేశ్వరసామీప్యము. |
| అరుణాదిత్యుఁడు | త్రిలోచనమందిరము |
| వృద్ధాదిత్యుఁడు | మీరుఘాటు |
| కేశవాదిత్యుఁడు | వరుణాసంగమము ఆదికేశవమందిరము. |
| విమలాదిత్యుఁడు | జంగమబాడి |
| గంగాదిత్యుఁడు | లలితాఘాటు |
| యమాదిత్యుఁడు | సంకటఘాటు |

ఇవిగాక వారయాత్ర, తిథియాత్ర, నక్షత్రయాత్ర, ఋతుయాత్ర, మాసయాత్ర, అయనయాత్ర, సంవత్సరయాత్ర, పర్వయాత్ర, ఆవరణయాత్ర యని యనేకయాత్రలు కాశీఖండమున విశేషముగ వర్ణింపఁబడి యుండెను. అవి యన్నియుఁ జేర్చిన ప్రత్యేకగ్రంథమగు నని యిందు చేర్చుట లేదు.

కాశీమాహాత్మ్యము

సమాప్తము

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1933.

# పురాణములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అధ్యాత్మరామాయణము, మూలము ... | 1 | 0 |
| అధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | 3 | 0 |
| కార్తికమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 12 |
| గయామాహాత్మ్యము, తెనుఁగువచనము ... | 0 | 6 |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యము ... | 1 | 0 |
| జగన్నాథమాహాత్మ్యము, తెనుఁగువచనము ... | 0 | 2 |
| ధనుర్మాసమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 2 |
| సింహాచలక్షేత్రమాహాత్మ్యము, తెనుఁగువచనము ... | 0 | 8 |
| బాలరామాయణము, సటీక ... | 0 | 2 |
| బాలరామాయణము, మూలము, పెద్దచ్చు ... | 0 | 1 |
| పద్మపురాణాంతర్గతమాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము | 2 | 0 |
| శ్రీమద్రామాయణము, మూలము, సాధారణప్రతి ... | 3 | 8 |
| డిటో రెండువాల్యములు, దళసరికాగితములు ... | 6 | 0 |
| డిటో సుందరకాండము, చిన్నసైజు ... | 1 | 0 |
| డిటో ఉత్తరకాండము, మేలుప్రతి ... | 1 | 4 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు, చిన్నసైజున చక్కఁగముద్రితము ... | 15 | 0 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండసహా, ఆంధ్రతాత్పర్యసహితము, 7 వాల్యములు ... | 17 | 0 |
| డిటో బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 2 | 0 |
| డిటో అయోధ్యాకాండము ,, ... | 3 | 0 |
| డిటో ఆరణ్యకాండము ,, ... | 2 | 0 |
| డిటో కిష్కింధాకాండము ,, ... | 2 | 8 |
| డిటో సుందరకాండము ,, ... | 2 | 0 |
| డిటో యుద్ధకాండము ,, ... | 4 | 0 |
| డిటో ఉత్తరకాండము ,, ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.